


# వైదిక ధర్మం అంటే?

## విద్యార్థుల సందేహాలు - సమాధానాలు

## ప్రశ్నోత్తర ప్రబోధం




కర్త:

సుమార్థి

(డా. కోడూరి సుబ్బారావు)




# వైదిక ధర్మం అంటే?

## విద్యార్థుల సందేహాలు-సమాధానాలు
## (ప్రశ్నోత్తర ప్రబోధం)





కర్త

**సుమ్నార్థి**

డా॥ కోడూరి సుబ్బారావు

సంపాదకుడు

వాచస్పతి డా॥ **మట్టి కృష్ణారెడ్డి**

M.A., M.Ed., Ph.D., D.Litt.



గాయత్రీ ఆశ్రమ ట్రస్టు ప్రచురణ

వైదిక ధర్మము

ప్రథమ ముద్రణ : ప్లవనామ ఆశ్వయుజ విజయ దశమి
అక్టోబరు 2021

ప్రతులు : 1000

వెల : రూ.50/-

సృష్టి సంవత్సరం : 1,97,29,49,122
విక్రమాబ్దము : 2077
కలియుగ సంవత్సరం : 5122
ప్రతులకు :

1. డా॥ కోదూరి సుబ్బారావు, వైదికవానప్రస్థాశ్రమం,
హనుమాపురం; భువనగిరి-508116. సెల్:99089 94084
2. గాయత్రీ ఆశ్రమ ట్రస్టు, ఆర్యసమాజము,
12-10-586/6. మేడిబావి, సీతాఫలమండి,
సికింద్రాబాద్-500 061. సెల్ : 98480 11073
3. శ్రీ మాశెట్టి శ్రీనివాస్ ఆర్య, షాప్ నెం.5, మాశెట్టి బిల్డింగ్,
3-3-736-740, కంచరిబజార్, సికింద్రాబాద్,
ఫోన్: 040-6632 0300.
4. డా॥ మట్టి కృష్ణారెడ్డి, వేదధర్మ ప్రచార ట్రస్టు(రి.).,
2-27, ఆర్య సమాజ మందిరం, బాదం కాంప్లెక్సు,
చైతన్యపురి క్రాస్ రోడ్, దిల్‌సుఖ్‌నగర్.
హైదరాబాద్-60, సెల్ : 94412 00322
5. శ్రీ బాశెట్టి సత్తయ్య, జె-38, రాంగోపాల్‌పేట,
సికింద్రాబాద్-500 003. సెల్ : 99485 39795
6. ఆర్యసమాజ మందిరం, మెయిన్‌రోడ్, రైల్వే ఫ్లైఓవర్ దగ్గర,
సీతాఫలమండి-500 061, 040-27071816;
91331 34156; 92461 74018

# ముద్రణ ద్రవ్యదాత

## శ్రీ మానుకొండ రాధాకృష్ణమూర్తిగారి సంక్షిప్త పరిచయము

శ్రీ మానుకొండ రాధాకృష్ణమూర్తిగారు గుంటూరు జిల్లాంతర్గత తెనాలి పట్టణంలో క్రీ.శ. 1943, జూన్‌లో జన్మించారు. వీరి తల్లిదండ్రులు స్వ|| మానుకొండ వీరరాఘవమ్మ, స్వ|| క్రిష్ణయ్య గార్లు.వీరు ధార్మికులు, శ్రమశీలులు, దానగుణములు గలిగిన, ఈ ఆదర్శ దంపతు వీరికి మొత్తం 11 మంది సంతానం. వారిలో మొదటగా వరుసగా 5 గురు ఆడపిల్లలు పుట్టారు. అందులో చివరి ఇరువురు బాల్యమునందే మరణించిన తరువాత 6వ సంతానంగా శ్రీ మానుకొండ రాధాకృష్ణ మూర్తి గారు జన్మించిరి. వీరి తరువాత ఇద్దరు మొగపిల్లలు కలుగగా అందులో ఒకరు బాల్యములోనే మరణించిరి. అనంతరము ఒక ఆడపిల్ల, మరి ఇద్దరు మొగపిల్లలు కలిగిరి. దురదృష్టవసాత్తు తండ్రి క్రిష్ణయ్యగారు తమ 57 సం|| వయస్సులోనే 1962లో అకాల మృత్యువాతబడిరి. అప్పటికి రాధాకృష్ణమూర్తిగారి వయస్సు 19 సం||లు మాత్రమే. అప్పటికి మిగిలిన నలుగురు ఆడపిల్లలు, నలుగురు మొగపిల్లతో పెద్ద కుటుంబ బాధ్యత అంతా తల్లిగారైన వీరరాఘవమ్మగారిపై బడినది. మూర్తిగారు కుటుంబ బాధ్యతల నిర్వహణలో తల్లిగారికి సహకరిస్తూనే తన చదువును కొనసాగించిరి. తండ్రిగారి కోరికమేరకు తల్లిగారు మూర్తిగారి మెకానికల్ ఇంజినీరింగు పూర్తి అయ్యేవరకు చదివించిరి. 1967 సం|| నాటికి B.Sc., తరువాత B.E. (Mechanical)డిగ్రీతో చదువును ముగించారు.

అనంతరము మూర్తిగారు మినిస్ట్రీ ఆఫ్ డిఫెన్సులో ఉద్యోగము సంపాదించి గవర్నమెంట్ ఆఫ్ ఇండియా సంబంధిత ఆఫీసులలో పనిచేశారు. క్రమంగా సీనియర్ సైంటిస్ట్ అయ్యారు. ఆ విధముగా భారత ప్రభుత్వ రక్షణశాఖలో పని చేస్తూనే తన తమ్ముళ్ళు ముగ్గురికి వారి ఇష్టముల మేరకు సంతృప్తిగా చదివించిరి. దురదృష్టవగాత్తు తల్లిగారు తన 68 సం|| వయస్సులో 1985 సం||లో దివంగతులైనారు. అప్పటికి మూర్తిగారి వయస్సు 42 సం||లు తరువాత వారు శ్రమించి 1994లో మిగిలిన ఒక చెల్లెలికి పెళ్ళిచేశారు. 'దానితో తన తండ్రిగారి చివరి కోరిక "అందరు బాగుండాలి" అనే తన

కోరికను పూర్తిచేసి పితృవాక్య పరిపాలకులయినారు. మూర్తిగారు మాత్రము నైష్ఠిక బ్రహ్మచారులుగానే ఇప్పటికి మిగిలి ఉన్నారు.

అనంతరము శ్రీ రాధాకృష్ణమూర్తిగారు తమ తల్లిదండ్రులపేరున 'నూనుకొండ వీరరాఘవమ్మ మరియు క్రిష్ణయ్యగార్ల మెమోరియల్ చారిటబుల్ ట్రస్టు'ను 2006 సం॥లో స్థాపించిరి. అప్పటి నుండి వ్యవస్థాపక అధ్యక్షుడిగా ఆ ట్రస్టు పేరుతో అనేకమందికి అనేక రకములుగా ఆర్థిక సహాయము చేస్తూ వస్తున్నారు. ముఖ్యంగా వైదిక ధర్మ ప్రచారమునకు పాటుపడుచున్న పండితులకు, సంస్థలకు ఉదారంగా చేయూత నిస్తున్నారు. వైదిక గురుకులాలకు, విద్యార్థులకు ఫీజులతో మరియు రోగులకు మందుల రూపములో సహాయము చేస్తూ ఉన్నారు. పేద వృద్ధులకు నెలవారి పింఛనులు గాను, కళ్ళకు ఆపరేషన్లకు గాను, ఇలా సమాజానికి సేవలందిచుచున్నారు. అంతేగాక గోదావరి కృష్ణానదుల పుష్కరాల సందర్భంగా సుమారు 27 వేలమందికి తమ తల్లిదండ్రుల పేరుమీద అన్నప్రసాదవితరణ కావించారు.

తెనాలిలో ఆర్య సమాజ భవనమునకు, నందివెలుగు వృద్ధాశ్రమమునకు, రాయపూడి వైదిక ఆశ్రమమునకు విరివిగా సాయం చేస్తున్నారు.

ఇక వారి ఆధ్యాత్మిక క్షేత్రాన్ని పరిశీలించితే– శ్రీ రాధాకృష్ణమూర్తి గారికి 25 సం॥ల వయస్సులోనే తెనాలి పట్టణంలో 1967 సం॥లలో శ్రీ గానం రామారావు (రామదేవ్)గారి ద్వారా ఆర్య సమాజ సిద్ధాంతాలతో పరిచయం కలిగినది. ఆ వైదిక సిద్ధాంతాలు హేతుబద్ధం గానే కాక వైజ్ఞానికంగా కూడ ఉన్నాయని వీరు గ్రహించారు. శ్రీరామదేవ్‌గారే స్వయంగా, 'విద్వత్ శిరోమణి', 'షడ్దర్శనాచార్య', 'కళాప్రపూర్ణ' బిరుదాంకితులయిన పండిత గోపదేవ్‌శాస్త్రిగారితో పరిచయం చేశారు. ఆ గురుదేవుల ద్వారా వైదిక సిద్ధాంతాలను బాగుగా అవగాహన చేసుకున్నారు. వాటిపై శ్రద్ధ ఏర్పడినది. అప్పటినుండి 1996 లో శ్రీ శాస్త్రిగారు పరమపదించే వరకు తరచుగా గురువుగారిని కలుసుకుంటూ వారి జ్ఞానాన్ని మరింత విస్తృతం చేసుకున్నారు.

ప్రస్తుతం వీరు 76 సం॥ వయసులో ఆరోగ్యముగానే ఉన్నారు. హైదరాబాదునందుగల హైదర్‌నగర్ (మియాపూర్) ప్రాంతములో నివసిస్తున్నారు. ఎవరైనా మిత్రులు వారిని కలవటానికి వస్తే వారితో ఆధ్యాత్మిక,

భౌతిక విషయాలు ప్రస్తావిస్తూ వైదిక సిద్ధాంతాలను సెంటిఫిక్‌గా విశ్లేషించి చెబుతూ, అపగాహాస కలిగించుతూ జ్ఞాన బోధ చేసి పంపుతున్నారు.

అట్టి ఆదర్శ పురుషులకు సర్వవ్యాపక సర్వేశ్వరుడు శతాధిక ఆయువును ప్రసాదించుగాక! ఇదే ఉత్సాహంగా, మరెన్నోరకములుగా వైదిక ధర్మమునకు, సత్పాత్రులైన పేదలకు, విద్యావంతులకు సేవలందిస్తూ ఉందురుగాక! పరమాత్మ వారికి తగిన ఆయురారోగ్యములను ప్రసాదించునుగాక !

## శ్రీరాధాకృష్ణమూర్తిగారితో నా స్వంత పరిచయము-అనుభవము

శ్రీమాన్ మానుకొండ రాధాకృష్ణమూర్తిగారు, ఆర్యసమాజ క్షేత్రములో ఉన్న పండితులకు, ప్రచారకులకు అందరకు తెలిసినవారే.

సుమారు 10 సం॥ క్రిందట నేను ప్రస్తుతం నివసిస్తున్న "వైదిక వానప్రస్థాశ్రమము (భువనగిరి)నకు తన స్నేహితుడు శ్రీభావజుల సదానందాచారి గారితో కలిసి రాధాకృష్ణమూర్తిగారు రావటం జరిగినది. అప్పుడే నాకు వారితో ప్రథమ పరిచయం ఏర్పడినది. అనంతరం వారిని మా గాయత్రీ ఆశ్రమాని (సీతాఫల్‌మండి)కి వచ్చి చూసివెళ్ళమని నేను కొరడం, వారు వచ్చి వెళ్ళటం, అట్లాగే నేనును హైదర్‌నగరు హైదరాబాదులోని వారి నివాసం చూసి రావటం జరిగాయి.

ఆ పరిచయముతో వారు నావలెనే ఒంటరి జీవితం గడపటం ఇంటిపనులు, వంటపనులు-స్వయంగా చేసుకుంటూ ఆధ్యాత్మిక యౌగిక జీవితం గపడటం మొదలైన విషయాలను గుర్తించాను. దానితో నాకు వారిపై శ్రద్ధ ఏర్పడినది. వారికి కూడ నాపై అభిమానము అనుగ్రహముల కలిగాయి. దానితో నా స్వంత అవసరములను ఏదైనా ఆర్థిక సహాయము అవసరముంటే, నిస్సందేహంగా తనకు తెలుపమని అడిగిరి. తన శక్తికొలది సాయం చేస్తామన్నారు." అట్లే నాకు కంటి రెటీనా సమస్య వచ్చినప్పుడు, 2,3 పర్యాయముల ఆర్థిక సహాయము చేశారు. సమస్య కొంత ఉపశమించిన తదుపరి నా జీర్ణశక్తి చాలా ఇబ్బంది పెట్టినది. దానితో వారు మరొక సారి స్పందించి తనకు వేరేవైద్యులవలన తగ్గిన కొన్ని బాధలు సిద్ధవైద్యంతో తగ్గాయని మీరు వెంటనే బయలుదేరి వస్తే ఆ వైద్యుని వద్దకు తీసుకొని వేళతాననీ

అందుకు కావలసిన ఖర్చులు అన్ని నేనే భరించుతానని కొండంత భరోసా నిచ్చారు. అన్నట్లుగానే నన్ను ఎల్లారెడ్డి గూడ హైదరాబాదులో ఆ సిద్ధవైద్యుని వద్దకు తీసివెళ్ళి మందులు ఇప్పించారు. అందుకు అవసరమయిన డాక్టరు ఫీజులు, మందుల ఖర్చులు అన్నీ ఉదారంగా వారే భరించారు.

అంతేగాక, ముద్రణకు చాలా కాలంగా ఎదురుచూస్తున్న ఈ "వేదామృతం" పుస్తకాన్ని ముద్రించి ఇవ్వవలసినదిగా కోరినప్పుడు దానికి వెంటనే స్పందించి అంగీకరించారు. ఇంతేగాక నేను ముద్రించదలచిన ప్రతి గ్రంథానికి కూడా ధన సహాయం చేయగలని హామీ ఇచ్చినారు. ఈ గ్రంథాన్ని 1000 ప్రతులు ముద్రించుటకు గాను పూర్తి ఖర్చు మొత్తం 20,000/- రూపాయలను గాయత్రి ఆశ్రమ ట్రస్టుకు దానంగా ఇచ్చారు. ఇట్టి విశాల హృదయులయిన శ్రీరాధాకృష్ణమూర్తి(యం. ఆర్. కె. మూర్తి)గారికి నా హృదయపూర్వక ధన్యవాదములు, కృతజ్ఞతలు తెలుపుకుంటున్నాను.

సర్వవ్యాపక సర్వేశ్వరుడు వీరికి శతాధిక ఆయువును, ఆరోగ్య మును, ఉత్సాహమును ఇచ్చి కాపాడుగాక ! మరెన్నో దాన ధర్మములు చేసి పుణ్యభాగులగునట్లు ప్రేరేపించునుగాక!

బుధజనవిధేయుడు

సుమ్నార్థి

డా. కోదూరి సుబ్బారావు

# విషయసూచిక

# వైదిక ధర్మం అంటే ఏమిటి?

1. ప్రశ్న: గురూజీ! వైదిక ధర్మం అంటే ఏమిటి?

**ఉత్తరం:** ఈశ్వరీయ జ్ఞానమైన వేదాలను చదవడం, వాటి అర్థాలను గ్రహించడం వాటిననుసరించి జీవితాన్ని గడపటాన్ని వైదిక ధర్మం అంటారు.

ప్రశ్న: **గురూజీ! వైదిక ధర్మాన్ని ఆచరించటం వల్ల కలిగే లాభాలేమిటి?**

ఉత్తరం: వైదిక ధర్మం ఆచరించటం వల్ల కలిగే లాభాలు అనేకం. వాటిలో ముఖ్యమైనవి - మనలోని దోషాలను, లోపాలను పోగొట్టుకొని ఆత్మను పవిత్రపరచుకోవటం. అజ్ఞానాన్ని, అవిద్యను దూరం చేసుకొని జ్ఞానాన్ని కర్తవ్యాలను గుర్తించటం. తనకి మేలు చేసే శుభములను, భద్రములను గ్రహించటం, దుఃఖాలన్నిటిని పోగొట్టుకొని సుఖాలను పొందటం.

2. ప్రశ్న: **గురూజీ ! ఈ విషయాలు మనకెలా తెలుస్తాయి?**

**ఉత్తరం:** ఇవి కూడా వేదాల ద్వారానే తెలుస్తాయి. వేదాలలోని ప్రార్థనలన్నీ అలానే ఉంటాయి. ఉదాహరణకు:

ఓం **విశ్వాని దేవ సవితర్ దురితాని పరాసువ**

**యద్భద్రం తన్న ఆ సువ ॥**

ఋగ్వేదం (5-82-5), యజుర్వేదం (30-3)

సృష్టి కర్తవైన ఓ దేవా! సర్వాంతర్యామీ! నీవు మమ్మందరిని సత్కర్మలు చేయ ప్రేరేపించుము. మాలోని సమస్త దుర్గుణాలను, దుష్ట వ్యవహారాలను దూరంగా వెడలగొట్టి, మాకు భద్రములైన శుభ గుణాలను, శుభకర్మలను ప్రాప్తింపచేయుము. మాలో మంచిని నింపుము.

ఓం అగ్నే! నయ సుపథా రాయే అస్మాన్
విశ్వాని దేవ వయునాని విద్వాన్,
యుయోధ్యస్మజ్జుహురాణమేనో
భూయిష్ఠాన్తే నమ ఉక్తిం విధేమ ॥ యజుర్వేదం (40-16)

హే అగ్నే! ప్రకాశ స్వరూప ప్రభో! ధనప్రాప్తికై మమ్ము మంచి మార్గాన నడిపించుము. మనోవాక్కాయాలతో మేము చేయు సర్వ కర్మలను నీ వెరుగుదువు. మాలోని కుటిలమైన పాపభావాలను దూరం చేయుము. అందుకొరకే నిన్ను అత్యంత వినమ్రతతో వేడుకొనుచున్నాము.

ఎప్పుడైతే మనలోని పాపభావాలు, పాపకర్మలు తొలగిపోతాయో అప్పుడే మనకు శుభాలు, సుఖాలు ప్రాప్తిస్తాయి. దాదాపు వేదమంత్రాలలోని ప్రార్థనలన్నీ ఈవిధంగానే ఉంటాయి. అందుచే వాటిని నిత్యం చదువుతూ, చదివిస్తూ ఉండాలి. తెలియని అర్థాలను విద్వాంసుల ద్వారా తెలుసుకుంటూ ఉండాలి. తెలుసుకున్నవాటిని ఆచరిస్తూ ఉండాలి. ఇతరులకు బోధిస్తూ ఉండాలి.

3. ప్రశ్న: **గురూజీ ! వేదాలను చదివినంత మాత్రాన సుఖాలు లభిస్తాయా?**

**ఉత్తరం:** వేదాలను చదువుతూ ఉంటే - విహిత కర్మలేవో, నిషిద్ధ కర్మలేవో బాగ తెలుస్తాయి. విహితకర్మలంటే తప్పక చేయవలసిన కర్మలు. నిషిద్ధ కర్మ లంటే చేయకూడని కర్మలు. చేయకూడని కర్మలు చేస్తే పాపం తప్పక వస్తుంది. దానివల్ల మనకు కష్టాలు, నష్టాలు కలుగుతాయి. విహిత కర్మలు చేస్తూవుంటే క్రమంగా మనకు సుఖాలు కలుగుతూ ఉంటాయి. ఇంతే కాకుండా కర్మలు బంధనం కాకుండా కూడా చేసుకోవచ్చు.

## వేదం ఏమంటుందంటే

ఓం కుర్వన్నేవేహ కర్మాణి జిజీవిషేత్ శతం సమాః ॥
ఏవం త్వయి నాన్యథేతోఽస్తి న కర్మ లిప్యతే నరే ॥

యజుర్వేదం (40-2)

'ఓ మానవులారా! వేదంద్వారా నే నుపదేశించిన సత్కర్మలనాచరిస్తూనే నూరేండ్లు జీవించగోరుడు. వాటివల్ల కలిగే పుణ్యఫలాలను - ధన కనక వస్తు వాహనాది భౌతిక సుఖాలను గాని, క్షణిక ఇంద్రియ సుఖాలను గాని ఆశించక ఆ పుణ్యమును నాకర్పింపుడు. తద్వారా మీకు వైరాగ్యరూప

పరమశాంతి, మోక్షరూప పరమానందం లభిస్తాయి. కర్మలు సంసార బంధనాలు కాకుండా ఉండాలంటే ఇంతకన్న వేరొక మార్గం లేనే లేదు'. దీనినే మన ఆదర్శ పురుషుడు శ్రీకృష్ణుడు **'కర్మఫలత్యాగం'** అన్నాడు.

4. **ప్రశ్న: గురూజీ ! వేదాలను చదవటం వాటిని అర్థం చేసుకోవటం చాలా కష్టం, అందరు ఆవిధంగా చేయలేరు కదా?**

**ఉత్తరం:** మోక్షం పొందటం కూడా అంత సులభం కాదు. మోక్షం అంటే సర్వదు:ఖ నివృత్తి, కర్మబంధన నివృత్తి. బెల్లం ఎంతెంత వేస్తే పాయసం అంతంత తీపిగా అవుతూవుంటుంది. అలాగే వేద విషయాలను కొద్దికొద్దిగానే చదువ ప్రయత్నించాలి. క్రమంగా చదివే సామర్థ్యం, అర్థం చేసుకునే సామర్థ్యం పెరుగుతాయి. క్రమంగా మనసులోని చెడుగుణాలు దూరమవుతూ మంచి వైపు అనగా సత్కర్మల వైపు ప్రవృత్తి కలుగుతూ ఉంటుంది.

5. **ప్రశ్న: గురూజీ ! వేదాలను పారాయణం చేయటం లేదా సస్వరపాఠం చేస్తేనే పుణ్యం వస్తుందంటారు? అది నిజమేనా?**

**ఉత్తరం:** వేదాలను పారాయణం చేయటం వల్ల సస్వరపాఠం వల్ల శారీరక ఆరోగ్యంలో కొంత మేలు జరుగుతుంది. శ్రవణం చేయటం వల్ల కూడా స్వల్పమైన మనఃశాంతి కలుగుతుంది. కాని పుణ్యం రాదు. ఉన్నతి కలుగదు. మందుల పట్టికను చదివినంత మాత్రాన రోగాలు పోతాయా? తగిన మందును సేవించి, పథ్యం చేస్తేనే కదా రోగాలు పోతాయి. వేద స్వాధ్యాయం చేయడం వల్ల కర్తవ్యాలు తెలుస్తాయి. ఆ కర్తవ్యాలను పాలించినపుడే నిజమైన లాభాలు కలుగుతాయి. వేదం ఏ రకంగా హెచ్చరిస్తున్నదో చూడండి.

ఓం **ఉత త్వః పశ్యన్ న దదర్శ వాచముత త్వః శృణ్వన్ శృణోత్యేనాం**

– ఋగ్వేదము (10-71-4)

అవిద్వాంసుడు వినుచూ వినడు, చూచుచూ చూడడు, చెప్పుచూ చెప్పడు. అంటే విద్వాంసుడు కానివాడు వేదార్థాలను, వేద రహస్యాలను తెలుసుకో లేడని భావం. కొంతైనా విద్య అవసరం.

ఓం అథేన్వాచరతి మాయయైష వాచం శుశ్రువాన్ అఫలామపుష్పాం॥
ఋగ్వేదం (10-71-5)

అవిద్వాంసుడు మాయ ఆవును వెంటగొని తిరుగువానివంటి వాడు. మాయ ఆవు పాలు ఇవ్వదు కదా! అట్లే వేదాజ్ఞలను పాటించనివాడు వేదవిద్యారూప ఫలాలను పొందలేడు. మరొక హెచ్చరిక కూడా ఇక్కడే తెలుసుకుందాము.

ఓం ఋచో అక్షరే పరమే వ్యోమన్ యస్మిన్ దేవ అధి విశ్వే నిషేదుః
యస్తన్న వేద కిమృచా కరిష్యతి య ఇత్తద్విదుస్త ఇమే సమాసతే ॥
- ఋగ్వేదము (1-164-39)

వ్యాపకుడు, అవినాశి, సర్వోత్కృష్టుడునగు పరమేశ్వరుని లోనే జడ చేతన దేవతలన్నీ ఉన్నాయి. అతనిలోనే వేదాల ముఖ్య తాత్పర్యం ఉంది. అట్టి పరబ్రహ్మనెరుగనివానికి ఋగ్వేదాదులవలన నిజమైన పరమానందం లభించదు.

కనుక ముందు మనం వేదాలను చదివి ధర్మాత్ములం కావాలి. అనంతరం యోగాభ్యాసం చేస్తూ అంతర్ముఖులమై ఆత్మ పరమాత్మల సాక్షాత్కారం పొందాలి. అప్పుడే సమస్త బంధనాలు, దుఃఖాలు సమసిపోయి పరమానంద రూప ముక్తి లభిస్తుంది. వేదాలన్నిటిని చదువలేనివారు వేద బోధలు గల విద్వాంసుల రచనలను -వేదోపదేశాలు, వేద ప్రవచనాలు, వేదాలలో విజ్ఞానం మున్నగు గ్రంథాలను చదవాలి. ముఖ్యంగా మహర్షి దయానందులవారు రచించిన జగత్ప్రసిద్ధ **'సత్యార్థ ప్రకాశం'** చదివితే చాలా విషయాలు తెలుస్తాయి. అనంతరం ఋగ్వేదాది భాష్యభూమిక, వేద భాష్యాలు చదువుతూ ఉంటే క్రమంగా చాలా జ్ఞానం కలుగుతుంది. మీరు తర్కపండితులైపోతారు.

## వేదము లనగా నేమి? అవి ఎలా వచ్చాయి?

**6.** ప్రశ్న: గురూజీ! వేదాలు, వేదాలు అనే మాటలు పలుమార్లు వింటున్నాము కదా! అసలు 'వేదం' అనే పదమునకు మూలార్థం ఏమిటి?

**ఉత్తరం:** వేదం అనే పదము **'విద్-జ్ఞానే'** అనే మూల సంస్కృత ధాతువుతో నిర్మించబడుతుంది. కనుక, వేదం అంటే జ్ఞానం అని మూలార్థం ("Root meaning"). ఐతే, వేదాలు అనే పేరు కేవలం సృష్టికర్త ద్వారా లభించిస జ్ఞాన నిధులకే- చతుర్వేదాలకే పరిమితం చేశారు మన ఋషులు. ఎంతటి విజ్ఞానవేత్తకైనా సృష్టికర్త కున్నంత జ్ఞానం ఉండదుకదా! పరిపూర్ణజ్ఞాని కేవలం పరమేశ్వరుడే కదా!

7. **ప్రశ్న: సృష్టికర్త నుండి వచ్చిన వేదాలు ఎన్ని ? వాటి పేర్లు ఏమిటి?**

**ఉత్తరం:** వేదాలు నాలుగు (4). 1. ఋగ్వేదం 2. యజుర్వేదం 3. సామవేదం 4. అథర్వవేదం. వేదాలకన్న ప్రాచీన గ్రంథాలు మరేవీ లేవు. వేదాల తరువాతనే మిగిలిన శాస్త్రాలన్నీ రచింపబడ్డాయి

8. **ప్రశ్న: మరి, దేవుడు నిరాకారుడు, సర్వవ్యాపకుడు కదా! వేదాలను ఎలా వ్రాశాడు? ఎలా వినిపించాడు?**

**ఉత్తరం:** ఆది ఋషుల బుద్ధులలో ప్రకాశపరచాడు.

9. **ప్రశ్న: ఆదిమానవసృష్టి ఎక్కడ జరిగింది.**

**ఉత్తరం:** ఆదిమానవసృష్టి త్రివిష్టప పీఠభూమిపై నేటి మానస సరోవర ప్రాంతంలో జరిగిందని మన శాస్త్రాలు చెబుతున్నాయి.

10. **ప్రశ్న: ఆదిమానవులు ఎవరికి పుట్టారు ? దేవునికా ? ఎలా పుట్టారు?**

**ఉత్తరం:** ఆ ఆది మానవులు నేటి శిశు జననాలవలెకాక భూగర్భంలోనే అండాలలో యువావస్థ వరకు ఎదిగి అండాలను పగలగొట్టుకుని బయటకు వచ్చారట. కోడి గ్రుడ్డును పగలగొట్టుకుని కోడిపిల్లలు బయటకు వచ్చినట్లు వచ్చారట. వారు ఒకే జంటగా కాక అనేకమంది స్త్రీలు, పురుషులు ఒకేసారి ఉద్భవించటం జరిగిందట ఆ ఆదిమానవుల బౌద్ధికస్థాయి ఒకే రకంగా కాక 3 రకాలుగా ఉంటుందని వేదం చెబుతుంది. దీనికి కారణం పూర్వ సృష్టిలో వారు చేసిన సాధన సంస్కారాలేనట.

## వేదం ఏమంటుందంటే -

ఓం **'తేన దేవా అయజన్త సాధ్యా ఋషయశ్చ యే' -**

యజుర్వేదము-(31.9)

ఆది మానవులు **'దేవతలు, సాధ్యులు, ఋషులు'** నని 3 రకాలుగా ఉన్నారు.

దేవతలంటే - విద్యా వినయ సంపన్నులు, పరోపకార పరాయణులు.

సాధ్యులంటే - సృష్టికార్యానికి సాధకులుగా ఉండే సామాన్య మానవులు. వీరు దేవత్వాన్ని, ఋషిత్వాన్ని పొందడానికి సాధన చేస్తుంటారు.

ఋషులంటే - విద్యలోను, యోగ సాధనలోను అత్యున్నత స్థితిని పొందినవారు. అంతర్ముఖులై వేదమంత్రాల అర్థాలను సమాధి స్థితిలో దర్శించగలవారు. ఆది సృష్టిలోని ఋషులు నలుగురు. వారికే సృష్టికర్త సృష్టిజ్ఞానాన్నంతా 4 భాగాలుగా చేసి ఆ నలుగురు ఋషుల హృదయాలలో (బుద్ధులలో) ప్రకాశపరచాడు

11. ప్రశ్న: **గురూజీ! ఆ ఆది ఋషులు ఎవరెవరు ? ఎవరెవరికి ఏ ఏ వేదభాగాల జ్ఞానాన్నిచ్చాడు ?**

**ఉత్తరం: ఓం అగ్నేర్ ఋగ్వేదో, వాయోర్ యజుర్వేదః ।**
**సూర్యాత్ సామవేదః, అథార్వాఙ్గిరసో ముఖమ్ ॥**

శతపథబ్రాహ్మణం(11.5.2.3)

'అగ్నిః' అను పేరుగల ఋషికి ఋగ్వేదాన్ని, **'వాయుః'** అనే ఋషికి యజుర్వేదాన్ని, **'సూర్యః'** (ఆదిత్యః) అను ఋషికి సామవేదాన్ని, **'అంగిరసః'** అనే ఋషికి అథర్వవేదాన్ని యిచ్చాడు అని వేదమే చెబుతున్నది.

12. ప్రశ్న: **గురూజీ "వేదాలు సృష్టికర్త రచనలు కావు, సృష్టి కొంతకాలం జరిగిన తరువాత క్రమంగా మానవులు జ్ఞానవంతులయ్యారు. వారిలో కొందరు వేదాలను వ్రాశారు" అని కొందరంటారు. దీనికి మీ సమాధానం ఏమి ?**

ఉత్తరం: ఈ ప్రశ్నకు కూడా వేదాలే సమాధానం చెబుతున్నాయి చూడండి-

ఓం **తస్మాత్ యజ్ఞాత్ సర్వహుత ఋచః సామాని జజ్ఞిరే ।**
**ఛన్దాంసి జజ్ఞిరే తస్మాత్ యజుః తస్మాత్ అజాయత ॥**

- యజుర్వేదం(31.7)

ఆ సృష్టిరూప యజ్ఞాన్ని నిర్వహించే పరమేశ్వరుని నుండే ఋగ్వేద సామవేదాలు వచ్చాయి. ఛందస్సులుగా చెప్పబడే అథర్వవేదం మరియు యజుర్వేదం ఉత్పన్నం అయ్యాయి. కనుక, వేదాలు ఈశ్వరీయ జ్ఞానమే, ఋషులు వ్రాసినవికావు.

ఇంతేగాక, అనంతరం ఋషులు వ్రాసిన గ్రంథాలన్నిటిలోను వేదాలు ఈశ్వరీయాలే, మా రచనలు కావని పేర్కొన్నారు. కావాలంటే ఈ విషయంలో పరిశోధనలు (PhDలు) చెయ్యండి

13. ప్రశ్న: **వేద శాస్త్రాలను శ్రుతులు, స్మృతులు అంటూంటారు. ఎందుకని?**

**ఉత్తరం:-** శ్రుతులంటే వినిపించినవి అని అర్థం. ఈ పేరు కేవలం పైన వివరించిన వేదాలకే వర్తిస్తాయి. ఎందుచేతనంటే అవి స్వరబద్ధం చేయబడ్డాయి. కనుక గురువుగారి దగ్గర వింటూ నేర్చుకోవలసినవి. **అవి ఉదాత్తములు, అనుదాత్తములు స్వరితములు** నని ముఖ్యంగా 3 రకాలుగా ఉంటాయి. వీటితోబాటు సప్త స్వరాలు కూడా ఉంటాయి. అవన్నీ తెలుసుకొని చదివే వారిని వేదపాఠీయులు అంటారు.

మనవంటి సామాన్య మానవులు ఏకస్వరంలో చదువుకోవచ్చును. వాటి అర్థాలను గ్రహించటమే ముఖ్యం. స్మృతులు అంటే వేద మంత్రార్థద్రష్టలైన ఋషులు వ్రాసిన గ్రంథాలు. ఇవి చాలా ఉన్నాయి. వేదార్థాలను సామాన్య మానవుల కందజేయాలని ఋషులు ఎన్నెన్నో శాస్త్రాలను రచించారు. బ్రాహ్మణాలు, ఆరణ్యకాలు, దర్శనాలు, ఉపనిషత్ లు మొదలగునవి మరియు ఆయుర్వేద, వాస్తు, శిల్ప, సంగీత, జ్యోతిషాదివైజ్ఞానిక గ్రంథాలు మరెన్నో ఋషులు వ్రాశారు. వీటన్నిటిని స్మృతులంటారు.

## వేద పఠనం వల్ల కలిగే లాభాలు

14. ప్రశ్న: గురూజీ! వేద పఠనం వల్ల కలిగే ముఖ్యమైన లాభాలేమిటో చెప్పండి?

**ఉత్తరం:** జిజ్ఞాసువులారా ! ఈ విషయం వేదవచనాల ద్వారానే తెలుసుకుందాము-

ఓం పావమానీర్యో అధ్యేత్యృషిభిః సంభృతం రసమ్ ।
తస్మై సరస్వతీ దుహే క్షీరం సర్పిర్మధూదకమ్ ॥

ఋగ్వేదం. 9.67.32

ఏ మానవుడు ఋషులద్వారా రక్షింపబడిన పవిత్రమైన వేదరసమును అధ్యయనం చేస్తాడో అతనికి సరస్వతీమాత - వేదమాత పాలు, నెయ్యి, తేనె. నీరు పుష్కలంగా యిస్తుంది. అంటే - లౌకిక, పారలౌకిక సుఖాల నన్నిటిని పొందటానికి చక్కటి దారి చూపిస్తుంది. మరొక మంత్రం-

ఓం **స్తుతా మయా వరదా వేదమాతా**
**ప్రచోదయన్తాం పావమానీ ద్విజానాం-**
**ఆయుః ప్రాణం ప్రజాం పశుం కీర్తిం ద్రవిణం**
**బ్రహ్మవర్చసమ్, మహ్యం దత్వా ప్రజత బ్రహ్మలోకమ్ ॥**

అధర్వవేదం. 19.71.1

నాచే కీర్తింపబడిన - అధ్యయనం చేయబడిన వరదాయనియైన 'వేదమాత' ద్విజులను అనగా విద్యాసంపన్నులను పవిత్రపరచి సత్కర్మలయందు ప్రేరేపించునుగాక. ఆ వేదమాత నాకు దీర్ఘాయువును, బలమైన ప్రాణశక్తిని, సుపుత్రులను, సన్మిత్రులను, గో అశ్వాది పశుసంపదలను, సువిశాల కీర్తిని, పుష్కల ధనరాశిని స్థిరసమాధిచే కలుగు బ్రహ్మవర్చస్సును ప్రసాదించి, చివరకు నన్ను బ్రహ్మలోకానికి - మోక్షధామానికి చేర్చును గాక!" అంటుంది వేదమాత. అంటే, పై సంపదలనన్నిటిని పొందే మార్గాలన్నీ వేదాలలో ఉన్నాయన్న మాట. కనుక వేదాలను అందరూ చదవాలి. అందరూ చదువ వచ్చును కూడా వేదాలను మానవమాత్రులందరు చదువ వచ్చును.

**15. ప్రశ్న: గురూజీ ! వేదాలను అందరూ చదువవచ్చునా? కొందరు స్త్రీలు, శూద్రులు చదువకూడదంటారు కదా!**

**ఉత్తరం:** మానవమాత్రులందరూ చదువవచ్చు. దీనికి వేదమే అన్నిటికన్న పెద్ద ప్రమాణం -

ఓం యథేమాం వాచం కల్యాణీ మావదాని జనేభ్యః
బ్రహ్మరాజన్యాభ్యాం శూద్రాయ చార్యాయ చ స్వాయ చారణాయ ॥
యజుర్వేదం. 26.2

ఓ మానవులారా! పరమేశ్వరుడనైన నేను ఈ కల్యాణకరమగు వేదవాణిని మానవమాత్రులందరి కొరకు ఉపదేశించుచున్నాను. బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రులకు మరియు వారి స్త్రీలకు, భృత్యులకు, సదాచార పరాయణులైన అంత్యజులకొరకును కూడా ఉపదేశించు చున్నాను. అట్లనే మీరును అందరకు ఉపదేశిస్తూ ముందు తరాలవారి కందించండి. వేదకర్తయైన పరమేశ్వరుడే ఇవి అందరికొరకు అంటున్నాడు. ఇక సంకోచ మెందుకు? వేదాలను అందరూ చదువవచ్చు, చదివించవచ్చు, వినవచ్చు, వినిపించవచ్చు, ఆచరించవచ్చు, ఆచరింపచేయవచ్చు. అందరూ ఉన్నతి చెందవచ్చు.

## వేదాలలో దేవుని స్వరూపం

16. ప్రశ్న: **గురూజీ ! వేదాలలో దేవుని గురించి ఏమని చెప్పబడింది?**

**ఉత్తరం:** ముఖ్యంగా దేవుడు సృష్టి స్థితి లయాలు మూడింటికి అతడొక్కడే కర్తయని చెప్పబడింది.

17. ప్రశ్న: **గురూజీ ! మరి బ్రహ్మ విష్ణు మహేశ్వరు లను ముగ్గురు కలిసి ఈ సృష్టి స్థితి లయాలు చేస్తున్నారనే కథలు సత్యంకావా?**

**ఉత్తరం:** ఈ కథలన్నీ సత్యాలు కావు. బ్రహ్మ విష్ణు మహేశ్వరలనే 3 పేర్లూ ఆ ఏకేశ్వరుని పేర్లే, బ్రహ్మ అంటే **'బృహి - వృద్ధౌ'** పెద్దది, గొప్పది అని అర్థం. దేవునికన్న పెద్దవాడు, గొప్పవాడు మరొకరు లేరు కనుక దేవునికి 'బ్రహ్మ' అని పేరు.

విష్ణువు అంటే **'విష్ల్భవ్యాప్తౌ'** వ్యాపించి ఉండేవాడని అర్థం. దేవుడు అన్నిటి లోపల వెలుపల అంతటా వ్యాపించి ఉంటాడు. కనుక దేవునకు **'విష్ణు'**వని పేరు.

మహేశ్వరుడు అంటే **'ఈశ - నియమనే'** గొప్ప ఈశ్వరుడని అర్థం. అతడు అన్నిటిని నియమించి నడిపించే వారిలో అందరికన్న గొప్పవాడని

అర్థం. ఇట్లే వేదాలలో దేవునకు 200 లకు పైగా పేర్లు చెప్పబడ్డాయి. వివరాలకు నాచే రచింపబడిన **"దేవు డొక్కడే - నామములనేకం"** అనే పుస్తకంలో చూడండి.

18. ప్రశ్న:- దీనికి వేద ప్రమాణమేమి?

ఉత్తరం:- అట్టి మంత్రాలు వేదాలలో చాలా ఉన్నాయి. అందులో ఒకటి

ఓం **ఇన్ద్రం మిత్రం వరుణమ్ అగ్నిమ్ ఆహూర్ అథో దివ్యః**
**స సుపర్ణో గరుత్మాన్! ఏకం సద్ విప్రా బహుధా వదన్తి**
**అగ్నిం యమం మాతరిశ్వానమ్ ఆహుః ॥**

–ఋగ్వేదం. 1. 164. 46, అథర్వవేదం. 9. 10. 28

పై మంత్రంలోని పేర్లన్నీ ఒకే దేవునివి. ఉపనిషత్తులలోనూ ఇట్లే చెప్పబడింది.

శ్లో ॥ **స బ్రహ్మా, స విష్ణుః, స రుద్రః, స శివ+అక్షర**
**స పరమః స్వరాట్, స ఇంద్ర స్స కాలాగ్ని స్స చంద్రమాః ॥**

కైవల్యోపనిషత్తు (1-8)

కనుక మతానికి ఒక దేవుడు, సంప్రదాయానికి ఒక దేవుడు వేరువేరుగా ఉండరు. మనందరి శరీర నిర్మాణం, జీవన క్రియలు ఒకే రకంగా ఉన్నాయి కదా ! కనుక మనందరిని పుట్టించినది, జీవింప చేస్తున్నది, కాలాంతరంలో జీవాత్మలమైన మనను ఈ శరీరంనుండి వేరుచేసి శరీరాన్ని చంపునది కూడా ఆ ఒక్క దేవుడే. సృష్టి స్థితి లయాలు చేస్తున్నది కూడా ఆ ఏకేశ్వరుడే.

19. **ప్రశ్న: గురూజీ ! బాగుంది, చక్కగా తెలిసింది. మరి అతడు అంతటా వ్యాపించి ఎలా ఉంటాడు? కొన్ని ఉపమానాలు చెప్పండి.**

ఉత్తరం: "స్థూలపదార్థంలో దానికన్న సూక్ష్మపదార్థం వ్యాపించగలదు" అనేది ప్రాకృతిక నియమం

ఉదా :- భూమిపై బిందెడు నీళ్ళుపోస్తే కొద్దిసేపటిలో అవి ఇంకిపోయి నీరు భూమి ఒక చోటనే ఉంటాయి కదా! నీటిని పాత్రలో పోసి మరిగిస్తే

నీటిలో అగ్ని ప్రవేశించి దానిలోచేయి పెడితే కాలుస్తుంది కదా! దూది బొమ్మను నీటిలో ముంచితే నీళ్ళు బొమ్మలో ప్రవేశించి బొమ్మా నీరు ఒకటిగా ఉంటాయి కదా ! దేవుడు వీటన్నిటికన్నా సూక్ష్ముడు కనుక అన్నిటిలో వ్యాపించి ఉంటాడు. రాయి. ఇనుము. వజ్రం వంటి వాటిలో కూడా వ్యాపించి ఉంటాడు. అవి కూడా అణు పరమాణు సంఘాతాలే-కలియికలే. విచిత్రమైన మరొక విషయం - మన మనస్సు, బుద్ధి, జీవాత్మలమైన మనము చాలా సూక్ష్మ పదార్థాలము. దేవుడు మనో బుద్ధులకన్నా, జీవాత్మలకన్నా కూడా చాలా సూక్ష్ముడు కనుక అతడు జీవాత్మలమైన మనలోనూ వ్యాపించి అంతర్యామిగా ఉన్నాడు. మనం మనలోనికి వెళ్ళి చూడగలిగితే దేవుడు మనకు కనబడతాడు. అయితే, అందుకు అష్టాంగ యోగసాధన చెయ్యక తప్పదు.

20. ప్రశ్న:- **గురూజీ ! దేవుడు కైలాసంలో, వైకుంఠంలో, నాల్గవ ఆకాశంలో, ఏడవ ఆకాశంలో ఉంటాడని లోకంలో రకరరాలుగా చెప్పుకుం టున్నారు కదా! అవన్నీ అసత్యాలేనా?**

**ఉత్తరం:** అవన్నీ పూర్తిగా అసత్యాలు. దేవుడు ఏదో పై లోకాలలో ఉంటే సృష్టి కార్యాలు ఎలా జరుగుతాయి? ప్రతీ క్షణం ఎన్నో ప్రాణులు పుడుతున్నాయి, కొంతకాలం జీవిస్తున్నాయి, చివరికి మరణిస్తున్నాయి. దేవుడు ఎక్కడో ఉంటే ఈ పనులన్నీ జరుగుతాయా? కర్త ఒక చోట క్రియలు మరొక చోట జరగవు కదా ! గర్భిణీ గర్భంలో శిశువును నిర్మాంచాలంటే దేవుడు గర్భంలోనే ఉండాలి కదా !

21. ప్రశ్న:- **గురూజీ ! మానవులకు అవి సాధ్యంకాదు కాని, దేవుడు చాలా గొప్ప మహిమ కలవాడు. రాజుగారు రాజధానిలో ఉండి దేశాన్ని పాలిస్తున్నారు కదా! అట్లే దేవుడు కూడా పాలించ వచ్చుకదా?**

**ఉత్తరం:** రాజుగారు రాచకార్యాలు శాసనాల ద్వారా నడిపిస్తారే కాని ప్రాణులను పుట్టించి జీవింపచేయులేరు. ఇంతేగాక, మానవులు మనోవాక్కాయాలతో చేసే కర్మలకు తగిన కర్మఫలాల నివ్వాలంటే రాజుల వల్లగాని, న్యాయమూర్తులవల్లగాని సాధ్యం కాదు.

22. ప్రశ్న: దీనికి తగిన వేద ప్రమాణాలున్నాయా?

ఉత్తరం: వందలకొలది ఉన్నాయి. మచ్చుకు ('Sample'గా) 3,4 మంత్రాలు-

1. **ఓం ఈశావాస్య మిదం సర్వం యత్కిఞ్చ జగత్యాం జగత్...**

యజుర్వేదం (40-1)

ఈ సర్వ జగత్తు కించిత్ నుండి-పరమాణువుల నుండి గతి శీలమైయున్న బ్రహ్మాండముల వరకు సర్వ నియామకుడైన ఈశునిచే (దేవునిచే) వ్యాపించబడి ఉంది.

2. **ఓం తదేజతి తన్నైజతి తద్దూరే తద్వంతికే ।**

**తదన్తరస్య సర్వస్య తదు సర్వస్యాస్య బాహ్యతః ॥**

యజుర్వేదం (40-5)

అన్నిటిని చలాయమానం చేసే పరమాత్మ తత్త్వం తాను చలించదు (కదలదు). అది అత్యంత దూరంలోనూ ఉంది, అతి సమీపంలోనూ ఉంది. అన్నిటి లోపలా వెలుపలా కూడా ఉంది.

3. ఓం స పర్యగాత్ శుక్ర మకాయ మవ్రణ

**మస్నావిరం శుద్ధ మపాప విద్ధమ్, కవిర్ మనీషీ ।**

**పరిభూః స్వయంభూర్ యాథా తథ్యతోஉర్థాన్**

**వ్యదధా చ్ఛాశ్వతీభ్యః సమాభ్యః ॥**

యజుర్వేదం (40-8)

ఆ పరమాత్మ తత్త్వం అంతటా వ్యాపించి ఉంది. అది **శుక్రమ్** - అనంత శక్తి సామర్థ్యాలు గలది. దానికి శరీరంలేదు. దానికి **వ్రణాలు** - నాడులు కూడా లేవు. శరీర ధారణ చెయ్యదు - అవతార మెత్తదు. **శుద్ధమ్**- అది పరమ పవిత్రమైనది. అది పాపపుణ్యాలతో కట్టుబడదు. ఆ పరమాత్మ వేదాన్ని రచించిన గొప్ప కవి

**మనీషి** - అందరి మనస్సులను ఎరుగునది.

**పరిభూః** - అన్నిటిని ఆవరించి ఉంది.

**స్వయంభూః** - అది స్వయంగానే ఉంది. దాని నెవరూ పుట్టించలేదు. అట్టి పరమాత్మ ఆది మానవ సృష్టికాలంలో ఋషులద్వారా మానవులకు సృష్టి యొక్క జ్ఞాన విజ్ఞానాలనన్నిటిని ఏ మాత్రం దాపరికం లేకుండా (చతుర్వేదాల ద్వారా) అందించింది. ఆ వేదాలు ఎవరికొరకనగా సనాతనులైన జీవులకొరకు. ముఖ్యంగా మానవులకొరకు అందించింది. దానినే మనం దేవుడనీ, పరమేశ్వరుడని అంటున్నాము.

**ఓం హిరణ్య గర్భః సమవర్త తాగ్రే**
**భూతస్య జాతః పతిరేక ఆసీత్ ।**
**స దాధార పృథివీం ద్యాముతేమాం,**
**కస్మై దేవాయ హవిషా విధేమ ॥**

యజుర్వేదం (13-1)

సృష్టికి పూర్వం ప్రళయకాలంలో సూర్యాది జ్యోతిస్సులను బీజ రూపంలో తన గర్భంలో ధరించిన హిరణ్యగర్భుడు (దేవదేవుడు) ఉండెను. అతడే సృష్టిలోని సమస్త పదార్థాలను ఏవి ఎలా ఉండాలో అలా ఎవరి సహాయం లేకుండా తానొక్కడే సృష్టించాడు. పాలించి పోషించే పతికూడా అతడే. ఆ ఒక్కడే. అతని ఆధారంతోనే ఈ పృథివీ ద్యులోకాలు వాటి వాటి స్థానాలలో ఉంటూ పరిభ్రమిస్తున్నాయి. అట్టి ఆనంద స్వరూప సుఖ ప్రదాతకు సత్కర్మలు అను హవిస్సుల నర్పించి విధేయతతో నమస్కరించండి “ అంటున్నది వేదం.

**23. ప్రశ్న:- గురూజీ ! దేవుడు నిరాకారుడు, సర్వవ్యాపకుడు, సర్వాధారుడు కదా! మరి అతని నెలా పూజించాలి? ఎలా ఉపాసించాలి?**

**ఉత్తరం:** అతడు నిరాకారుడైనా, ఎంత పెద్దవాడైనా అతడు మన మనో బుద్ధులలోను జీవాత్మలమైన మనలోను కూడా వ్యాపించి అంతర్యామిగా అతి దగ్గరగా ఉన్నాడు. కనుక, మనం అంతర్ముఖులమై మన మనస్సులలో స్మరించుకోవచ్చు. ధ్యానం చేసుకోవచ్చు. మన కృతజ్ఞతలను వెల్లడించుకోవచ్చు. ఈ పద్ధతిని మన ఋషులు సంధ్యావందన మన్నారు, చక్కగా ఆ విధి విధానాలను అనుసరిస్తేనే అసలైన దేవుని పూజ అవుతుంది. వాటి వివరాలను **“సంధ్యావందనం - వైజ్ఞానిక సమాలోచనం”** అనే నా రచనలో చూడండి.

ఆ మంత్రాలలో ముఖ్యమైనది మరియు జపించవలసినది గాయత్రీ మంత్రం. దాని నిక్కడ సంక్షిప్తంగా తెలుసుకుందాము.

## గాయత్రీ మహామంత్రం

ఓం భూర్భువః స్వః । **తత్సవితుర్వరేణ్యం,**
**భర్గో దేవస్యధీమహి, ధియో యో నః ప్రచోదయాత్ ॥**

-ఋగ్వేదం. 3. 62. 10,యజుర్వేదం. 36. 3
సామవేదం (900వ మంత్రం)

**మంత్రార్థం:-** హే సర్వ సంరక్షకా ! సచ్చిదానంద స్వరూపా! నీ దివ్యము వరేణ్యమునైన భర్గమును – విశుద్ధ ప్రకాశాన్ని మేము మా బుద్ధులతో ధ్యానించెదముగాక. నీవు మా బుద్ధులను వికసింపచేసి సత్కర్మలు చేయ ప్రేరేపింతువుగాక.

ఈ అర్థాన్ని మనస్సులో భావన చేస్తూ బుద్ధితో ఒక దివ్యజ్యోతిని ప్రకాశాన్ని ధ్యానం చెయ్యాలి. ఇది జపమంత్రం కనుక వీలైనన్ని ఎక్కువ పర్యాయాలు జపించాలి. కనీసం 24 పర్యాయాలు జపించాలి. గాయత్రీ ఛందస్సు 24 అక్షరాలు కలదిగా ఉంటుంది. కనుక కనీసం 24 సార్లు చేయటం మంచిదంటారు మన మహర్షులు, ఆ రకంగా జపిస్తే అద్భుతమైన ఫలితాలు కనబడతాయి. బుద్ధి వికసిస్తుంది, జ్ఞాపకశక్తి, ఏకాగ్రత పెరుగుతాయి. సత్కర్మలు చేయ – పరోపకార కార్యాలు చేయ ప్రేరణ కలుగుతుంది. జపించి చూడండి. మీకే తెలుస్తుంది. ఇదే నిజమైన దేవుని పూజ.

**24. ప్రశ్న: గురూజీ ! దేవుని స్తుతించాలి, ప్రార్థించాలి, ఉపాసించాలి, పూజించాలి అని రకరకాలుగా చెబుతూ ఉంటారు కదా! మరి వీటి అసలు అర్థాలు ఏమిటి?**

**ఉత్తరం:-** ఇవన్నీ ప్రార్థనలోని భాగాలే. వీటి గురించి కొద్దిగా తెలుసుకుందాము.

**1. స్తుతి :-** దేవుని గుణగుణాలను స్తుతించటం, కీర్తించటం చేస్తే దేవుని గొప్ప గొప్ప గుణాలేమిటో తెలిసి మనకు దేవునిపై భక్తి, శ్రద్ధలు

కలుగుతాయి. దానితో మనం అతనికి చేరువయ్యే ప్రయత్నం చేస్తాము. అతని మిత్రతను పొంద యత్నిస్తాము స్నేహసూత్రం ఏమిటంటే- **సఖ్యం సమాన గుణ వ్యసనేషు.** లోకంలో మనం ఒకరి మిత్రతను పొందాలంటే అతని గుణకర్మలను మనం అనుసరించాలి. మనలో వాటిని ప్రయత్నపూర్వకంగా తెచ్చుకోవాలి. అప్పుడే మనం అతని మిత్రతను పొందగలుగుతాము. కనుక మనం దేవునికి దగ్గర కావాలంటే దేవుడు దయామయుడు, న్యాయకారి, నిరంతర కర్మశీలి, పక్షపాత రహితుడు, సదా ఇతరుల మేలు కోరేవాడు కనుక ఈ సద్గుణాలు మనలో ఎంత శాతం ఉన్నాయి? అని ఆత్మ నిరీక్షణ చేసుకోవాలి. అసలు లేనివాటిని మనం ప్రయత్న పూర్వకంగా తెచ్చుకోవాలి. స్వల్పంగా ఉన్న గుణాలను పెంచుకోవాలి. అట్టి ప్రయత్నం చేస్తేనే దానిని స్తుతి అనాలి. లేకుంటే వాటిని పొల్లు మాటలు అనాలి. నా అభిప్రాయమేమిటంటే- కేవలం చేతులు జోడించడం వల్లనో, మంత్రాలను పఠించటం వల్లనో, పద్యాలతో, శ్లోకాలతో కీర్తించటం వల్లనో, పాటలు పాడటం వల్లనో అది దేవుని స్తుతి కాదు. అతని గుణగణాలను చింతనచేస్తూ వాటిని మనలోకి తెచ్చుకోవాలి. దేవుని గుణగణాలకు అనుగుణంగా మన గుణ కర్మ స్వభావాలను మలచుకోవాలి. అప్పుడే మానవులకు కళ్యాణం (మేలు) జరుగుతుంది. బెల్లం బెల్లం అని ఎన్ని సార్లు పలికినా నోరు తీపికాదు. ప్రయత్నించి బెల్లం సంపాదించుకొని, తింటేనే నోరు తియ్యగా అవుతుంది కదా !

**2.** **ప్రార్థన** అంటే (ప్ర+అర్థన) విశేషంగా అర్థించటం, యాచించటం. సహాయాన్ని కోరటం. మనం సామాన్యంగా మన శక్తికి మించిన పనులలోనే ఇతరుల సహాయాన్ని కోరుతూ ఉంటాం. అట్లే మనం భౌతిక అవసరాల కొరకు కష్టిస్తూ పరమేశ్వరుని సహాయం కొరకు ప్రార్థించాలి. ఈ విషయంలో వేదం ఏమంటుందంటే

**అక్షైర్మా దీవ్యః కృషిమిత్ కృషస్వ విత్తే రమస్వ బహు మన్యమానః ।**
**తత్ర గావః కితవ తత్ర జాయా, తన్మే విచష్టే సవితాయమర్యః ॥**

ఋగ్వేదం. 10.34.13

ఓ మానవులారా ! మీరు జూదరివలె పాచికలను ఆడుతూ ధనాన్ని ఆర్జించాలని ఆశించవద్దు. వ్యవసాయదారుని వలె కష్టిస్తూ సంపదల నార్జించ

యత్నించండి. ఆ విధంగా సంపాదించిన సంపదలే మీకు గౌరవాన్ని కలిగిస్తాయి మీ భార్యాపిల్లలు మీకు అనుకూలురౌతారు. అంతర్యామియై ప్రేరేపించు ఆ పరమేశ్వరుడు ఈ ధర్మరహస్యాన్ని మీరంతా చక్కగా గ్రహించగలుగునట్లు చేయును గాక" అంటుంది. లాటరీలు, గుఱ్ఱపు పందాలు, కోడి పందాలు మొదలైనవన్నీ జూదముల వంటివే. కష్టపడకుండా ధనం సంపాదించాలని ఆశించటమే. ఇవి మంచివి కావు. పరమేశ్వర ప్రార్థన చెయ్యటంవల్ల మనలో నిరభిమానత కలుగుతుంది, నేను కనుక ఇవన్నీ చెయ్యగలిగాననే గర్వం రాకుండా ఉంటుంది. ధర్మమార్గంలో కష్టిస్తున్న నాకు దేవుని సహాయం తప్పక లభిస్తుందనే ఉత్సాహం కలుగుతుంది. దైవసహాయం కూడా లభిస్తుంది.

3. **ఉపాసన:** 'ఉపాసన'అంటే **(ఉప+ఆసన)** పరమేశ్వరుని సమీపంలో కొంతసేపు కూర్చోవటం. సర్వవ్యాపకుడైయున్న పరమాత్మ మన శరీర ఇంద్రియ మనోబుద్ధులలోను జీవాత్మలమైన మనలో కూడా వ్యాపించి అతి సమీపంలో ఉన్నాడనే భావనను స్థిరపరచుకుంటూ కొంతసేపు గడుపుతూ ఉంటే ఆత్మ పరమాత్మల సాక్షాత్కారం కలుగుతుంది. దివ్యమైన ఆనందానుభూతి కలుగుతుంది. అగ్నిసమీపంలో కూర్చున్నవారికి వేడి, నీటి సమీపంలో కూర్చున్నవారికి చల్లదనం లభించినట్లు మనకు అంతర్యామిని ఉపాసిస్తే దేవునిలోని కొన్ని దివ్యగుణాలు మనకు ప్రాప్తిస్తాయి.

4. **పూజ:** పూజించటం అంటే **(పూజానామ సత్కారః)** గౌరవించటం, సత్కరించటం అని అర్థం. తల్లిదండ్రులను పూజించటమంటే వారి మాటలను వింటూ, అచరిస్తూ వారికి ప్రియంగా నడచుకోవటం. పెద్దలను పూజించటమంటే కూడా ఇట్లే. దేవుని పూజించటమంటే వేదం ద్వారా దేవుడు చెప్పిన నియమ నిబంధనలను పాటిస్తూ ఉండాలి. పంచ మహాయజ్ఞాలను, విశేషహోమాలను, షోడశ సంస్కారాలను ఆచరిస్తూ వీలైనంత ఎక్కువగా ధర్మకార్యాలు చేస్తూ దేవుని బిడ్డగా జీవించాలి. అదే నిజమైన దేవుని పూజ.

నేడు లోకంలో దేవుని పూజ వికృత రూపం ధరించింది. నిరాకారుడు సర్వవ్యాపకుడునైన దేవునికి రకరకాల ఆకారాలు కల్పించి షోడశోపచారాలతో పూజిస్తున్నారు. ఇది వైదిక ధర్మానికి పూర్తిగా విరుద్ధం.

**"న తస్య ప్రతిమా అస్తి, యస్య నామ మహద్ యశః"**

మహా యశస్వియైన పరమాత్మకు ప్రతిమ లేదు. ఉండదు. అని వేదం (యజు. 32-3లో) స్పష్టంగా చెబుతున్నది. ఆదిశంకరాచార్యులవారు తమ **"పరాపూజ"** అనే స్తోత్రంలో విగ్రహారాధనను తీవ్రంగా ఖండించారు వేదాంత దర్శన భాష్యంలో రెండవ సూత్రమైన **"కరణవచ్చే న్న భోగాదిభ్యః"** అనే సూత్రానికి అర్థాన్ని వివరిస్తూ విగ్రహారాధనను, అవతారవాదాన్ని అంగీకరిస్తే దేవుడు కూడా సామాన్య మానవుడే అవుతాడన్నారు.

**అథ లోక దర్శనానుసారేణ ఈశ్వరస్యాపి కిఞ్చిత్ కరణానామా మాయతనం కామేన కల్పేత । ఏవమపి నోపపద్యతే, స శరీరవత్సే హి సతి సంసారివద్ భోగాది ప్రసజ్గాత్ ఈశ్వరస్యాప్యనీశ్వరత్వం ప్రసజ్యేత** లోకంలో చూస్తున్నట్లు పరమేశ్వరునకు శరీరం కల్పిస్తే సంసారివలె అతనికి కూడ భోగప్రసక్తి కలుగుతుంది. సుఖదుఃఖాలను అనుభవించవలసిన వాడవుతాడు. అనుభవిస్తే దోషమేమిటంటే - అప్పుడతడు ఈశ్వరుడు (దేవుడు) కాలేడు. కనుక సుఖదుఃఖాలకు లోనయ్యేవాడు దేవుడు కాదు అన్నారు. కనుక సంధ్యావందనమే నిజమైన పూజ, విగ్రహారాధన కాదు.

అట్లే గోపూజ అంటే - గోవులకు సేవ చేయడం, వాటిని శుభ్రపరచి వాటికి అవసరమైన మేత వేసి పాలించటం. గంగా మాత పూజ అంటే గంగను పరిశుభ్రపరచి, అడ్డంకులను తొలగించి పొలాలకు ఆ నీటిని పారించటం.

**25. ప్రశ్న: గురూజీ ! దేవుడు నిరాకారుడు కదా! మరి అతని గుణకర్మ స్వభావాలు మనకెట్లా తెలుస్తాయి?**

**ఉత్తరం:** చాలా మంచి ప్రశ్న. దేవుని గుణకర్మ స్వభావాలు ఉన్నది ఉన్నట్లుగా తెలుసుకోవాలంటే వేద స్వాధ్యాయం చేస్తేనే తెలుస్తుంది, పురాణ స్వాధ్యాయంవల్ల కాదు. పురాణాలు మనలను తప్పు మార్గం వైపు నడిపించే ప్రమాదం కూడా ఉంది. అందుకనే మన మహర్షులు - **"శ్రోతవ్యః శ్రుతి వాక్యేభ్యః"** - శ్రుతి వాక్యాలతోనే - వేద వాక్యాలతోనే దేవుని తెలుసుకోండన్నారు. దేవుని గుణగణాలు తెలుసుకోవడానికి మరొక మార్గం కూడా వుంది. వేదం ఏమంటుందంటే -

**విష్ణోః కర్మాణి పశ్యత, యతో వ్రతాని పస్పశే,**
**ఇన్ద్రస్య యుజ్యః సఖా ॥** ఋగ్వేదము. 1.22.19

ఓ మానవులారా! సర్వ వ్యాపకుడైన విష్ణువు యొక్క సృష్టిరచన, పాలనక్రియలను పరిశీలనతో దర్శించండి. వాటి ననుసరించి మీరు కూడా వ్రతశీలురు కండి. బ్రహ్మాండాధిపతియైన ఇంద్రుడే మీరు అనుసరించదగిన యోగ్యుడైన సఖుడు, మిత్రుడు, స్నేహితుడు మరియు గురువు.

సృష్టిలో వ్యాపించియున్న దేవుని కర్మలను, నియమాలను గమనించండి. వాటిని చూసి పరిశీలించినపుడే మీరు మీ కర్తవ్యాలను తెలుసుకోగలుగుతారు. నిజమైన దేవుని పూజించువారు, ఉపాసించువారు ప్రపంచంలో చాలా తక్కువగా ఉన్నారు. అసలు దేవుని స్థానంలో రాళ్ళను, రప్పలను, కొండలను, గుట్టలను, తీర్థాలను, గురువులను పూజించేవారే అధికంగా ఉన్నారు. ఇట్టి మూఢనమ్మకాల వల్లనే మనుష్యులు పెక్కు దుఃఖాల ననుభవిస్తున్నారు. ఈ విషయాన్ని వేదం ఎంత స్పష్టంగా హెచ్చరిస్తున్నదో చూడండి -

**ఓం మా చిదన్యద్ విశంసత, సఖాయో మా రిషణ్యత ।**
**ఇన్ద్రమిత్స్తోతా వృషణం సచా సుతే ముహురుక్థా చ శంసత ॥**

-ఋగ్వేదము. 8.1.1

**సృష్టికర్త ఉవాచ:-**

"ఓ సఖులైన మానవులారా! సృష్టి స్థితి లయకర్తనైన నన్ను తప్ప మరెవ్వరిని మీరు ఉపాసించవద్దు. విగ్రహాలను, కొండలను, గుట్టలను, తీర్థాలను ఉపాసించవద్దు. అవన్నీ జ్ఞానం లేని జడపదార్థాలు. అట్లని గురువులను, బాబాలను, స్వాములను, యోగులను కూడా ఉపాసించవద్దు. వీరందరు మార్గదర్శకులు మాత్రమే. అట్లుపాసించి ఆత్మవంచన చేసుకోవద్దు. నేను పరమైశ్వర్యశాలినైన ఇంద్రుడను. మీరు మనోవాక్కాయాలతో చేసే కర్మలకు తగిన విధంగా ఫలితాలనిచ్చే విధాతను కూడా నేనే. ఇతరులెవ్వరు కర్మఫలదాతలు కారు. కనుక నన్నే స్తుతించండి, ప్రార్థించండి, ఉపాసించండి. అందరు కలిసి మెలసి స్తుతి ప్రార్థనోపాసనలు చేసుకోండి". అని హెచ్చరిస్తున్నాడు. కనుక మనం ఆ ఏకేశ్వరునే స్తుతిద్దాం, ప్రార్థిద్దాం, ఉపాసిద్దాం.

26. ప్రశ్న: గురూజీ ! కేవలం కర్మలకే దేవుడు ఫలితాలనిచ్చేవాడైతే ప్రార్థన చేయటం ఎందుకు? వేదాలలో కూడా ప్రార్థన మంత్రాలు ఉన్నాయి కదా! అవి ఎందుకు?

**ఉత్తరం:-** ముఖ్యంగా ప్రార్థన వల్ల నిరభిమానం కలుగుతుంది. అహంకార అభిమానాలు తొలగిపోతాయి. మనం ఎంతటి ప్రయత్నశీలురమైనా దైవసహాయం లేనిదే అవి ఫలించవు. దీనికి వ్యవసాయదారుని ఉపమానంగా తీసుకోమంటుంది వేదం. అట్లే విద్యార్థులు కూడా కష్టించి చదువుకుంటూ గాయత్రీ మంత్రంతో **"ధియో యో నః ప్రచోదయాత్"** – హే పరమేశ్వరా! మా బుద్ధులను ధారణావంతం చెయ్యి. మా బుద్ధులను వికసింపచెయ్యి. ఏకాగ్రతను, జ్ఞాపకశక్తిని, సమయస్ఫూర్తిని ప్రసాదించు" అంటూ ప్రార్థించుకోవాలి. అప్పుడు ధైర్యం, ఉత్సాహం రూపములో దైవసహాయం మనకు లభిస్తుంది. సత్కర్మలు చేయ చక్కటి ప్రేరణ కలుగుతుంది.

27. ప్రశ్న:- **గురూజీ ! విద్యార్థులు సరస్వతీదేవిని ప్రార్థించుకోవాలంటారు** కదా!

శ్లో: **యాకున్దేన్దు తుషారహార ధవళా యాశుభ్ర వస్త్రావృతా ।**
**యా వీణా వరదణ్డ మణ్డితకరా యా శ్వేత పద్మాసనా ॥**

అంటూ ఒక ప్రార్థనా శ్లోకం చదువుకోమంటారు కదా! ఆ సరస్వతీ దేవి ఎవరు?

**ఉత్తరం:-** సరస్వతి దేవి, లక్ష్మీదేవి అనే పేర్లు కూడా ఆ ఏకేశ్వరునివే. సరస్వతి స్త్రీ లింగ పదము కనుక కొందరు కవులు వేదాలను, విద్యలను, వాక్కులను, కళలను ఒక స్త్రీగా కల్పన చేసారు. ఆ చదువుల తల్లి శుభ్రమైన తెల్లని చీరను ధరించి మెడలో తెల్లని పూలమాలతో తెల్లని తామర పుష్పముపై పద్మాసనములో కూర్చుని ఒక చేతిలో వేదాలను, మరొక చేతిలో వీణను పట్టుకుని ఉన్నదంటూ పద్యాలను , శ్లోకాలను వ్రాసారు. అంతే కాని సరస్వతి అంటే ఒక స్త్రీమూర్తి కాదు. అది కవుల యొక్క కల్పనా చాతుర్యం మాత్రమే.

సరస్వతి పదమునకు **'సృ-గతౌ'** గతివంతమైనదని అర్థం. వ్యాకరణ శాస్త్రంలో గతికి జ్ఞానం, గమనం, ప్రాప్తి అని 3 అర్థాలున్నాయి.

ఆధ్యాత్మికార్థంలో సర్వజ్ఞాన నిధియైన పరమేశ్వరునికి, వేదాలకు సరస్వతి పదము వర్తిస్తుంది. ఆధిభౌతికార్థంలో వేదవిద్వాంసులైన స్త్రీలకు, పురుషులకు వర్తిస్తుంది. ఆధిదైవికార్థంలో జ్ఞానబోధకమైన వాక్కులకు (వాగ్దేవికి) గమనించే – ప్రవహించే జలానికి (నదికి) వర్తిస్తుంది. ఆయా సందర్భాలను బట్టి ఆయా అర్థాలను చెప్పుకోవాలి. విద్యార్థులు అంటే విద్యను అర్థించేవారు కనుక సర్వవిద్యానిధియైన దేవదేవుని పరంగానే ప్రార్థించుకోవాలి. ఓ సర్వ విద్యానిధివైన పరమేశ్వరా! సరస్వతీ ! మాకు వలయు విద్యలను ప్రసాదించుమని ప్రార్థించుకోవాలి. గాయత్రీమంత్రంతో బుద్ధివికాసం కొరకు ప్రార్థించుకోవాలి.

28. **ప్రశ్న: గురూజీ ! ఇప్పుడు మాకు సరస్వతి గురించీ, దేవుని గురించి బాగా అర్థమయ్యింది. కాని, మరొక ప్రశ్న మిగిలిపోయింది. అదేమంటే సర్వాంతర్యామియే కాని అప్పుడప్పుడు దుష్టశిక్షణ, శిష్ట రక్షణకు అవతరిస్తాడనీ, మానవ శరీరంలో ప్రవేశించి వస్తాడని అంటూంటారు కొందరు. మనం నిరాకార దేవుని ఊహించుకోలేకపోతున్నాం, సరిగా పూజించుకో లేకపోతున్నాం. కనుక దేవుని అవతారాలకు పూజలు చేసుకుంటే దోషమేముంటుంది?**

**ఉత్తరం:–** అవతారవాదం వేదానికి పూర్తిగా విరుద్ధం. ఎందుకంటే – పూర్వపు పుటలలో మనం చదువుకున్న **"స పర్యగాత్ శుక్రం అకాయం అవ్రణం అస్నావిరం...."**

అనే మంత్రాన్ని ఒకసారి గుర్తు తెచ్చుకోండి. ఆ మంత్రంలో **అకాయం** = అతనికి శరీరం లేదా **వ్రణాలు** – లోపాలు లేవు. **అస్నావిరం=** స్నాయు బంధనంలోనికి రాడు అని కదా తెలుసుకొన్నది. స్నాయుబంధనం అంటే నాడీ బంధనం. మనమంతా నాడీ బంధనంలో – నరాల బంధనంలో "Nerves" తో చుట్టి వేయబడ్డాము. శరీరంలో ఎక్కడ ఏది గుచ్చుకున్నా, దెబ్బలు తగిలినా, పళ్ళుపీకినా నరాల ద్వారా మెదడుద్వారా మనకు తెలిసిపోతుంది. కొన్ని బాధలు ఓర్చుకోలేక గోలపెడతాము. దేవుడు మనవలె నరాల బంధనంలోనికి రాడు. అంటే – ఏ తల్లి కోరికతోటి ఆమె గర్భంలోకి వచ్చి జన్మించడు.

30. ప్రశ్న: గురూజీ! ఒక మనిషి మరొకనితో ఎలా వ్యవహరించాలి?

ఉత్తరం: అందరిని మిత్రదృష్టితో - స్నేహితులుగా చూస్తూ వారితో వ్యవహరించాలి. వేదం ఏమంటుందంటే -

ఓం దృతే దృంహ మా మిత్రస్య చక్షుషా
సర్వాణి భూతాని సమీక్షన్తామ్,
మిత్రస్యాహం చక్షుషా సర్వాణి భూతాని
సమీక్షే మిత్రస్య చక్షుషా సమీక్షామహే ॥ యజుర్వేదం (36-18)

"హే దృతే! అవిద్యాంధకార నివారక జగదీశ్వరా! నీ కృపవల్ల సకల ప్రాణులు నన్ను మిత్రదృష్టితో చూచును గాక. నేననూ సకల ప్రాణులను మిత్ర దృష్టితో చూతును గాక. మేమందరము ఒకరినొకరము మిత్రదృష్టితో చూచుకుంటూ వ్యవహరింతుము గాక!" అని సంకల్పించుకుని అట్లే వ్యవహరించాలంటుంది వేదం".

మరొక మంత్రం ద్వేషరహితులు కండంటుంది-

**ఓం సహృదయం సాంమనస్య మనిద్వేషం కృణోమి వః ।**
**అన్యో అన్యమభి హర్యత వత్సం జాతమివాఘ్న్యా ॥**

అథర్వవేదం (3-30-1)

ఓ మానవులారా! మీరు విశాల హృదయులు, ఆలోచనాపరులు ద్వేషరహితులు కాగోరుచున్నాను. నవజాత వత్సమును గోమాత ప్రేమించునట్లు మీరు ఒకరి నొకరు ప్రేమించుకుంటూ, ఒకరి ఉన్నతికి మరొకరు తోడ్పడుచు ఉన్నతి చెందండంటుంది. వైదికధర్మం అప్పుడే పుట్టిన ఆవుదూడను దాని తల్లియైన గోమాత ఎలా ప్రేమిస్తుందో మీరెప్పుడైనా గమనించారా? ఇప్పుడు గోవులే తక్కువగా ఉన్నందున ఇప్పటి తరంవారు చాలా మంది దానిని చూసి ఉండరు. గోమాత ఈనిన తన బిడ్డను మానవమాత కన్న ఎక్కువగా ప్రేమిస్తుంది. తన ప్రేమను వ్యక్తపరచుకోవటానికి తన నాలుకతో ఉమ్మనీటిని - మైలపదార్థాన్ని నాకి నాకి శుభ్రం చేస్తుంది. మానవమాత అలా చెయ్యలేదు. ప్రసవ నొప్పులతో అలసి సొలసి నిశ్చేష్టురాలౌతుంది. ప్రక్కనున్న తల్లిగాని,

నర్సులుగాని మంచి దూదితో తుడిచి శుభ్రం చేసి బొడ్డు కోస్తారు. పాలిప్పిస్తారు. గోమాతకు చేతులు లేవు కనుక తన నాలుకతోనే ఆ పనిచేసి తన పాలనిస్తుంది. అలానే మనం మనతోటి మానవులలోని లోపాలను, వ్యసనాలను, దుఃఖాలను, దురాచారాలను పోగొట్ట యత్నించాలంటున్నది ఈ వేదమంత్రం. తోటివారిని సోదరులవలే చూడాలంటుంది.

మరొక మంత్రం-

ఓం **అజ్యేష్ఠాసః అకనిష్ఠాస ఏతే,**
**సంభ్రాతరో వావృధుః సౌభగాయ ।**
**యువా పితా స్వపా రుద్ర ఏషాం**
**సుదుఘా పృశ్నిః సుదినా మరుద్భ్యః ॥**

ఋగ్వేదం.5.60.5

ఓ మానవులారా! మీలో ఒకరు ఎక్కువగాని, ఒకరు తక్కువ గాని కారు. మీరంతా ఒకే పరమాత్ముని బిడ్డలు కావున మీరంతా పరస్పరం సోదరులు. మీరంతా కలిసి మెలసి ఉన్నతిని సాధించండి. సదా యువకుడైన ఆ పరమాత్మయే మీ అందరకు తండ్రి. అతడే మీ అందరకు మేలు చేయువాడు. న్యాయం చేయువాడు. అనేక సుఖాలనిచ్చే ఈ ప్రకృతి మీకు తల్లి. కనుక మనమంతా పరస్పరం సోదరులం అంటుంది.

## కుటుంబంలో పరస్పర వ్యవహారం

31. ప్రశ్న: **గురూజీ ! కుటుంబంలో** మనం ఎలా వ్యవహరించాలి?

**ఉత్తరం:** కౌటుంబిక వ్యవహారం గురించి వేదం ఎన్నెన్నో విషయాలను చెబుతుంది. కొన్ని ముఖ్యమైనవి ఇచట తెలుసుకుందాము - వాటిలో

ఓం **అనువ్రతః పితుః పుత్రో, మాత్రా భవతు సంమనాః ।**
**జాయా పత్యే మధుమతీం, వాచం వదతు శాన్తివామ్ ॥**

అథర్వవేదం(3-30-2)

పుత్రులు, పుత్రికలు తల్లి దండ్రులకు అనువ్రతులు కావాలి. ఆజ్ఞాకారులు కావాలి. వారి మాటలను ఉపదేశాలను అనుసరించాలి.

పితృవాక్య పరిపాలకులు కావాలి. తల్లితో మరింత సంమనస్కులు కావాలి. ఆమె మనకు బాల్యంలో చాలా సేవలు చేసింది. ఎప్పుడూ మన మేలును కోరుతూ మనకు పరమ ఆప్తురాలుగా ఉంటుంది. ఆమె మనకు ప్రథమ గురువు కూడా. చిన్నప్పుడు మనకు అన్నీ నేర్పింది అమ్మే కదా! అందుచే మనం **'మాతృదేవో భవ'** అని చెప్పినట్లు నిద్రలేవగానే ముందుగా తల్లికి పాదాభివందనం చెయ్యాలి. అనంతరం **"పితృదేవో భవ"** అంటూ తండ్రికి పాదాభివందనం చెయ్యాలి. అనంతరమే కుటుంబంలోని పెద్దలకు ప్రణామాలు చెయ్యాలి. అలా చేస్తే మనకెంతో మేలు కలుగుతుంది. మన మహర్షు లేమన్నారంటే

**శ్లో. అభివాదన శీలస్య నిత్యం వృద్ధోపసేవినః ।**
**చత్వారి తస్య వర్ధంతే ఆయుర్విద్యా యశోబలమ్ ॥**

మనుధర్మశాస్త్రం.(2-121)

ఎవరైతే నిత్యం (ప్రతిదినం) తల్లిదండ్రులకు, ఆచార్యులకు వృద్ధులకు ప్రణామం చేస్తూ, వారికి అవసరమైన సేవలు చేస్తుంటారో వారికి ఆయువు, విద్య, యశస్సు, బలము ఈ నాలుగు దినదినం వృద్ధిచెందుతూ ఉంటా" యన్నారు. కనుక-

మనం సదా పెద్దలను సేవిస్తూ ఉండాలి. పై మంత్రంలోని రెండవ పాదము ఏమంటున్నదంటే - భార్య తన భర్తపై మధుర భావన కలిగి ఉంటూ శాంతంగా భాషిస్తూ ఉండాలి. అట్లే భర్తలు కూడా తమ భార్యల పట్ల మధుర భావన కలిగి ఉంటూ ప్రేమతో పలకరించాలి" అంటున్నది

**32. ప్రశ్న: గురూజీ అన్నదమ్ములు, అక్క-చెల్లెండ్రు ఎలా ఉండాలి?**

**ఉత్తరం: దీనికి కూడా వేదం చక్కటి ఉపదేశం చేస్తుంది**

**ఓం మా భ్రాతా భ్రాతరం ద్విక్షన్మా స్వసారముత స్వసా ॥**
**సమ్యఞ్చః సవ్రతా భూత్వా వాచం వదత భద్రయా ॥**

- అథర్వవేదం (3-30-3)

అన్నదమ్ములు పరస్పరం ద్వేషభావాన్ని కలిగి ఉండకూడదు. అట్లే అక్కచెల్లెండ్రు కూడా ద్వేషాన్ని కలిగి ఉండకూడదు. పరస్పరం

పోట్లాడుకోకూడదు. ఇంట్లోని వారంతా సాయంత్రం ఒకచోట సమావేశమై సత్సంగం, ఆత్మనిరీక్షణ చేసుకోవాలి, సవ్రతులు- ఏకమనస్కులు, ఏక వ్రతశీలురు కావాలి. ఒకరి క్షేమాన్ని మరొకరు కాంక్షించే వారై ప్రేమతో మాట్లాడుకోవాలి. ఆదర్శ పురుషులు శ్రీరామ శ్రీకృష్ణుల ననుసరించిన వైదిక మార్గాన్ని అనుసరించాలి.

ఈ విధంగా 7 మంత్రాలు గల అథర్వవేద 3వ కాండలోని 30వ సూక్తమంతా కుటుంబ సౌహార్ధతను గురించిన మరేన్నో రీతి నీతులను ఉపదేశిస్తుంది. వాటిని అక్కడ తెలుసుకోండి.

## వివాహ విషయం - వేదం

33. ప్రశ్న: **గురూజీ ! వివాహం గురించి వేదం ఏమంటుంది ?**

**ఉత్తరం:** గురుకులంలో చదువుకోదలచిన విద్యలన్నీ చదివిన తదుపరి మాత్రమే అంటే యుక్త వయస్సు వచ్చిన తదుపరి మాత్రమే వివాహం చేసుకోమంటుంది. ప్రాచీనకాలంలో స్త్రీలకు వేరుగా పురుషులకు వేరుగా గురుకులాలుండేవి. రెండింటికి మధ్య 4.5, మైళ్ళ దూరముండేది. స్త్రీల గురుకులాలలో ఆచార్యులు, ఉపాధ్యాయులు, పనివారు కూడా అందరూ స్త్రీలే ఉండేవారు. ఒక్క పురుషుడు కూడా ఉండేవారు కాదు. అట్లే, పురుషుల గురుకులాలలో ఒక్క స్త్రీ కూడా ఉండేవారుకాదు. అంత నిష్ఠగా బ్రహ్మచర్యాన్ని పాటించేవారు.

34. ప్రశ్న: **గురూజీ ! దీనికేదైనా వేద ప్రమాణం ఉందా?**

**ఉత్తరం:** అథర్వవేదంలోని 26 మంత్రాలుగల 11వ కాండ 5వ సూక్తంలో బ్రహ్మచర్యాన్ని, దానివల్ల కలిగే లాభాల గురించి ఎన్నో విషయాలు చెప్పబడ్డాయి వాటిని అక్కడ చూడండి. లేదా నా రచన **"యజ్ఞోపవీత వైశిష్ట్యము, బ్రహ్మచర్య విశిష్టత"** అనే పుస్తకంలో చూడండి. ఆ మంత్రాలలో ఒక మంత్రం స్త్రీలు కూడా గురుకులాలలో బ్రహ్మచారిణులై వేదవిద్యను అభ్యసించాలి, యువావస్థ వచ్చిన తరువాతనే వివాహాలు చేసుకోవాలని సూచిస్తున్నది. చూడండి -

ఓం బ్రహ్మచర్యేణ కన్యా యువానం విన్దతే పతిమ్ ।
అనడ్వాన్ బ్రహ్మచర్యేణాశ్వో ఘాసం జిగీర్షతి ॥

అథర్వవేదం (11-5-18)

కన్యలు గురుకులాలలో బ్రహ్మచర్య వ్రతాన్ని పాటిస్తూ విద్యావతులు, యౌవ్వనవతులు అయిన తదుపరియే తన విద్యకు, గుణ కర్మ స్వభావాలకు తగిన బ్రహ్మచారిని వివాహం చేసుకోవాలి.

ఓ మానవులారా! మీకన్న జంతువులే బ్రహ్మచర్య వ్రతాన్నిగట్టిగా పాటిస్తున్నాయి. ఎద్దులు, అశ్వాలు మొదలైన వాటిని గమనించండి. అవి ఋతుకాలంలోనే సంగమిస్తాయి. వేరే సమయాలలో అవి సంగమించవు. అందుచేతనే అవి బలమైనవి ఔతున్నాయి' అంటున్నది.

మన ఆదర్శపురుషులు శ్రీరామ శ్రీకృష్ణుల వివాహాలు యువావస్థలోనే అయ్యాయి. సీత సముపస్థిత యవ్వనవతి కావటం గమనించిన తదుపరియే జనకమహారాజు సీతా స్వయంవరం ప్రకటించారు. వాల్మీకి రామాయణం బాలకాండలో ఈ విషయం స్పష్టంగా వ్రాసి ఉంది.

**35. ప్రశ్న: గురూజీ! స్వయంవర వివాహ మంటే ఏమిటి? దానికి వేదంలో ఏమైనా ప్రమాణం ఉందా?**

**ఉత్తరం:** 'స్వయంవరం' అంటే వధూవరులు ఒకరినొకరు స్వయంగా ఇష్టపడి పెండ్లి చేసుకోవటం. వివాహాలు కులాన్ని, కట్నకానుకలను బట్టి కాకూడదు. పరస్పర గుణ కర్మ స్వభావాలను, ఆశయాలను, ఆదర్శాలను, అభిరుచులను బాగా తెలుసుకొని ఆలోచించుకొని వధూవరులు స్వయంగా ఇష్టపడి పెండ్లి చేసుకోవాలి. ఏవైనా లోటుపాట్లు, తొందరపాట్లు ఉంటే పెద్దలు సూచించాలే కాని బలవంతంగా ఇష్టంలేని వారితో పెండ్లిళ్లు చేయకూడదు. కలిసి చిరకాలం కాపురం చేయవలసినవారు పిల్లలే కదా! వధూవరులంటే ఒకరినొకరు వరించుకొన్నవారు-బాగా ఇష్టపడినవారని అర్థం. వేదం కూడా ఇట్లే చెప్పుచున్నది. గమనించండి -

ఓం కియతీ యోషా మర్యతో వధూయోః పరిప్రీతా పన్యసా ।
వార్యేణ, భద్రా వధూర్భవతి యత్ సుపేశాః స్వయం సా
మిత్రం వనుతే జనే చిత్ ॥ -ఋగ్వేదం(10-27-12)

ఈ మంత్రం ద్వారా పరమేశ్వరుడు స్వయంవర పద్ధతిని ఎంత చక్కగా ఉపదేశిస్తున్నాడో చూడండి. సౌందర్యవతి, బుద్ధిమంతురాలును నైన యువతి యువావస్థను పొంది శుభగుణ సంపన్నులైన యువకుల నుండి తనకు తగిన వ్యక్తిని పతిగా నెంచుకొని జీవనసఖి కావాలి.

ఓం సఖే సప్తపదీ భవ... అని అభయమిచ్చే వరునకు ధర్మపత్ని కావాలి.

36. ప్రశ్న: **గురూజీ! మరొక సందేహం. యువావస్థ ఎంత వయస్సు నుండి వస్తుంది ? పురుషులకన్న స్త్రీలకే ముందు యువావస్థ వస్తుందా?**

**ఉత్తరం:** అవును. స్త్రీలకే ముందు యువావస్థ వస్తుంది. స్త్రీలకు 16వసంవత్సరంనుండే యువావస్థ ప్రారంభం అవుతుంది. పురుషులకు 25వ ఏటనుండి యువావస్థ ప్రారంభమౌతుంది. అంతవరకు వారు విధిగా బ్రహ్మచర్యం పాటించాలి.

అట్లని యువావస్థరాగానే పెండ్లికి సిద్ధం కావలసిన అవసరంలేదు. ఇది కేవలం కనీస బ్రహ్మచర్యం. మన ఆయుర్వేద శాస్త్రాలు ఏమంటాయో - ఈ క్రింది పట్టిక ద్వారా వయోభేదాలు ఎలా ఉండాలో మీకు బాగా అర్థం అవుతాయి

| | | | | | |
|---|---|---|---|---|---|
| పురుషుల వయస్సు | 25 | 30 | 36 | 40 | 44 సం.రం. |
| స్త్రీల వయస్సు | 16 | 17 | 18 | 20 | 22 సం.రం. |

అంటే-పురుషుని వయస్సు 25 అయితే స్త్రీ వయస్సు 16 తో సమానం అంటారు. కనుక తొందర పడక చదువులు పూర్తయిన తదుపరియే పెండ్లి చేసుకోవాలి. అంతవరకు స్త్రీల ప్రసక్తి పురుషులకు, పురుషుల ప్రసక్తి స్త్రీలకు రాకూడదు. కాలేజీలు వేరువేరుగా ఉండాలి. అప్పుడే వారి ఆరోగ్యం, వారికి పుట్టబోయే పిల్లల ఆరోగ్యం బాగుంటుంది

## పతీ పత్నుల వ్యవహారం

37. ప్రశ్న: గురూజీ! పతీ పత్నులు ఎలా వ్యవహరిస్తుండాలి?

**ఉత్తరం:** పతి ఏక పత్నీవ్రతుడు, పత్ని ఏక పతివ్రత కావాలి. వేదం ఎంత స్పష్టంగా చెబుతున్నదో చూడండి -

ఓం ఇహైవ స్తం మా వి యౌష్టం విశ్వమాయుర్వ్యశ్నుతామ్ ।
క్రీడంతౌ పుత్రైర్ + నప్తృభిర్+ మోదమానౌ స్వే గృహే ॥

-ఋగ్వేదం. 10.85.42

ఓ దంపతులారా! మీరిరువురు ఈ గృహస్థాశ్రమంలోనే ఉండండి, విడిపోవద్దు. విభేదాలు ఎప్పుడు కలుగకుండా వ్యవహరించండి. ఇద్దరు కలిసి పూర్ణాయువు ననుభవించండి. పుత్రపౌత్రాదులతో ఆడుతూ పాడుతూ ఆనందము ననుభవించండి. స్వగృహమునందే పూర్ణాయువు ననుభవించండి.

పై మంత్రాన్ని పరిశీలించండి - పదములన్నీ ద్వివచనంలోనే ఉన్నాయి. ఇవి కేవలం ఇద్దరిని గురించే చెబుతున్నాయి. కనుక ఒక పురుషునికి ఒక స్త్రీతోనే వివాహం జరగాలి. ఇద్దరు ముగ్గురితో కాదు. అట్లే స్త్రీలకును ఒక పతితోనే.

మరొక మంత్రం -

ఓం అక్ష్యై నౌ మధుసంకాశే అనీకం నౌ సమంజనమ్ ।
అన్తః కృణుష్వ మాం హృది మన ఇత్ నౌ సహాసతి ॥

అథర్వవేదం. 7.36.1

## దంపతులు ఈ విధంగా సంకల్పించుకోవాలి

మా ఇరువురి కన్నులు తేనెవలె ఆనందము నిచ్చునవి అగుగాక. మా యిరువురి ముఖాలు మృదువులుగా ప్రసన్నములుగా నుండునుగాక. ఒకరి నొకరం మా హృదయాలలో స్థిరపరచుకొందుముగాక. మా యిరువురి మనస్సులు ఒకటిగా నుండునుగాక - అన్యోన్యంగా ఉండుగాక. ముఖ్యంగా స్త్రీలు (పత్నులు) తన పతి కేవలం తనవాడే కావాలని కోరుకుంటుంది. కోరుకోవాలి కూడా-

"ఓం అభి త్వా మనుజాతేన దధామి మమ వాససా ।
యథాసో మమ కేవలో నాన్యాసాం కీర్తయాశ్చన ॥

అథర్వవేదం (7-37-1)

నేను ప్రాచీన సంప్రదాయము ననుసరించి మా యింటి వస్త్రముల నిచ్చుచున్నాను. అందువల్ల నీవు నా వాడవే యగుదువుగాక. ఏ యితర స్త్రీతోను ప్రేమ కలిగి యుండకుందువుగాక అని కోరుకోవాలి. దంపతులు పతివ్రతలు పత్నీవ్రతులు కావాలి." అంటుంది వేదం.

వివాహ సంస్కారంలో యిట్టి మంత్రాలు చాలా ఉంటాయి. మహర్షి దయానంద విరచిత 'సంస్కారవిధి' చాలా ప్రామాణికం. అదిగాని లేదా నా రచన "పెండ్లినాటి ప్రమాణాలు" గాని చదవండి. భార్యాభర్తల వ్యవహారాన్ని గురించి మీకు మరెన్నో విషయాలు తెలుస్తాయి

# యజ్ఞ స్వరూపం

**38. ప్రశ్న:- గురూజీ! భగవద్గీత 3,4 అధ్యాయాలలో రకరకాల యజ్ఞాల గురించి చెప్పబడింది. అసలు యజ్ఞం అంటే ఏమిటి ?**

**ఉత్తరం:- 'యజ్ఞ'** పదము **'యజ-దేవపూజ, సంగతికరణ, దానేషు'** అనే సంస్కృత మూల ధాతువుతో ఏర్పడింది. కనుక దేవతలను పూజించటం, సంగతీకరణం (సంగ్రహించటం, సమీకరించటం, సంఘటిత పరచటం), దానం చేయటం అనే 3 అర్థాలు యజ్ఞ పదములో ఉన్నాయి.

**39. ప్రశ్న:- గురూజీ! వీటిని కొద్దిగా వివరించండి?**

**ఉత్తరం:-** 1. దేవపూజ : దేవతలు అంటే దివ్యగుణాలు కలవారు లేదా దివ్యగుణాలు కలిగిన పదార్థాలు అని అర్థం. ఈ పదమును కూడా ఋషులు నిర్వచించి చెప్పారు.

**దేవో దానాద్ వా దీపనాద్ వా ద్యోత నాద్వా, ద్యుస్థానో భవతీతి వా** (నిరుక్తం 7-15) = అంటే దానప్రవృత్తి ఉండటం వల్లా, ప్రకాశింప చేయటం వలనా, స్వయంగా ప్రకాశించుచుండుట వలనా, ద్యుస్థానంల్ - సూర్య నక్షత్రాదులుండే చోట ఉండుట వలనా వాటిని దేవత లంటారు. ఇవి చేతన దేవతలనీ, జడదేవతలనీ (జ్ఞానంలేని దేవతలనీ) రెండు రకాలు. తల్లి, తండ్రి, గురువులు, సాధువులను, మహాత్ములను చేతన దేవతలంటారు. భూమి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము మొ॥ వాటిని జడదేవతలంటారు. ఈ రెండు రకాల దేవతలను పూజించటం - సత్కరించటం గౌరవించటం చేస్తే దానిని దేవపూజ అంటారు. ప్రాకృతిక దేవతలను అగ్నిహోత్రం ద్వారానూ, చేతన దేవతలను సత్కరించటం ద్వారానూ, సేవా సుశ్రూషలు చేయటం ద్వారానూ పూజించాలి. ఇట్టి దానిని దేవపూజ అంటారు. దీనిని దేవయజ్ఞం అనికూడా అంటారు.

**2.** **సంగతీకరణం:** ప్రకృతిలోని కొన్ని మూలకాలను కలిపి ప్రయోజనకరమైన క్రొత్త పదార్థాన్ని లేదా యంత్రాన్ని నిర్మించటం ఒక రకమైన సంగతి కరణం. అట్లే కొందరు వ్యక్తులను సంఘటిత పరచి ఒక సంస్థను, వ్యవస్థను నిర్మించి మానవసేవ చేయటం మరొక రకమైన సంగతీకరణం. స్వాతంత్ర్యో ద్యమం ఇట్టిదే. దీనిని స్వాతంత్ర్య యజ్ఞం అంటారు.

**3.** **దానం చేయటం** : న్యాయంగా సంపాదించిన దానిని సత్పాత్రులకు దానం చెయ్యటాన్ని సాత్వికదానం అంటారు. శ్రీకృష్ణ భగవానుడు ఉపదేశించినట్లు:

శ్లో: **దాతవ్యమితి యద్దానం దీయతే నుపకారిణే ।**
**దేశే కాలే చ పాత్రే చ తద్దానం సాత్త్వికం స్మృతమ్! ॥**

–భ.గీ. 17.20

దేశకాల పాత్రలను గుర్తించి ఈ దానం యివ్వదగినదే అనే బుద్ధితో ప్రత్యుపకారాన్ని ఆశించకుండా చేసే దానాన్ని **సాత్త్విక దానం"** అంటారు. పేరు ప్రఖ్యాతులకోసం, అధికారంకోసం చేసే దానాలు **'రాజస తామస దానాలన'** బడతాయి. ఈ దాన ప్రవృత్తి వ్యక్తులలో ఉంటే వారిని చేతనదేవతలంటారు.

**40.** ప్రశ్న: **గురూజీ! చేతన దేవతలంటే తెలిసింది మరి, జడదేవతలంటే ఎవరు? ఎంతమంది?**

**ఉత్తరం:-** ఈ దానశీలత వ్యక్తులలోనే కాక జడదేవతలలో- ప్రాకృతిక దేవతలలో కూడా ఉంటుంది. ఎట్లంటే - పంచ భూతాలు మనకెప్పుడూ మేలు చేస్తూనే ఉంటాయి. ఇవే కాక సూర్య చంద్ర నక్షత్రాదులు కూడా పరోక్షంగా మనకు మేలు చేస్తూనే ఉంటాయి. ఈ ఎనిమిదిని (5+3) కలిపి **అష్టవసువులు -** అష్ట వసుదేవత లంటారు. ఇంకా సూక్ష్మంగా ఆలోచిస్తే మన శరీరంలోని పంచప్రాణాలు, పంచ ఉపప్రాణాలు మేలు చేస్తూనే ఉన్నాయి. వాటివల్లే మన మనుగడ సాగుతున్నది. (5+5) ఈ పది ప్రాణాలను, జీవుడిని కలిపి ఏకాదశ రుద్రులన్నారు. రుద్రదేవతలన్నారు. ఎందుకంటే ఇవి శరీరాన్ని వదిలిపెట్టి పోతూవుంటే బంధుమిత్రులంతా రోదిస్తారుకదా! అందుకని.

ఇవేకాక, ద్వాదశాదిత్యులు, ఇంద్రుడు (విద్యుత్), ప్రజాపతి (ప్రజలకు మేలు చేసే అగ్నిహోత్రము - దేవయజ్ఞము) వీటన్నిటిని కలిపితే -

| | | | |
|---|---|---|---|
| 1. | అష్టవసువులు | – | 8 |
| 2. | ఏకాదశరుద్రులు | – | 11 |
| 3. | ద్వాదశాదిత్యులు | – | 12 |
| 4. | ఇంద్రుడు (విద్యుత్) | – | 1 |
| 5. | ప్రజాపతి (యజ్ఞము) | – | 1 |
| | మొత్తం | | 33 |

అందుకనే అథర్వవేదం (10–7–13) "త్రయస్త్రింశతిర్దేవాః" - 33 దేవతలంటుంది. యజుర్వేదంలో ఈ 33 దేవతలు అగ్నిహోత్రం ద్వారా సేవింపబడతాయని చెప్పబడింది

**41. ప్రశ్న: గురూజీ! ఇంతకీ, భగవద్గీతలో చెప్పిన రకరకాల యజ్ఞాల సంగతేమిటి?**

**శ్లో॥ ద్రవ్యయజ్ఞా స్తపోయజ్ఞాః యోగయజ్ఞా స్తథా పరే ।**
**స్వాధ్యాయ జ్ఞానయజ్ఞాశ్చ యతయః సంశిత వ్రతాః ॥**

– భ.గీ. 4.28

**ఉత్తరం:** అవన్నీ పై మూడు రకాల యజ్ఞాలలో ఇమిడిపోతాయి. కనుక సంక్షిప్తంగా **'యజ్ఞం'** అంటే తనకు, ఇతరులకు మేలు చేసే మంచి కర్మలని అర్థం.

**42. ప్రశ్న: గీతలో చెప్పినవన్నీ మనవంటి సామాన్యులు చేయలేరు కదా! వీటిలో చాలా ముఖ్యమైనవి ఏవేవి?**

**ఉత్తరం:** ఋషులు బాగా ఆలోచించి వేదాల వెలుగులో ఐదు రకాల యజ్ఞాలు గృహస్థులు, వానప్రస్థులు తప్పక చేయాలన్నారు. ఈ ఐదింటికి "పంచ మహా యజ్ఞాలని పేరు పెట్టారు. వాటిని తదుపరి ప్రకరణంలో వివరిస్తాను

## పంచమహా యజ్ఞాలు

**1.** బ్రహ్మయజ్ఞం :– బ్రహ్మప్రాప్తి కొరకు చేయబడే యజ్ఞాన్ని బ్రహ్మయజ్ఞం అంటారు. బ్రహ్మ అంటే సర్వవ్యాపక సర్వేశ్వరుడని మాత్రమే అర్థం. దీనిని లోకంలో "సంధ్యావందనం" అనే పేరుతో వ్యవహరిస్తారు. ఉదయసాయం

సంధ్యా సమయాలలో ఈ బ్రహ్మయజ్ఞం చేస్తారు కనుక దీని కాపేరు వచ్చింది. పరమేశ్వరుడు మనకు ఉత్తమ మానవ జన్మనిచ్చి వికసించిన 5 జ్ఞానేంద్రియాలను, 5 కర్మేంద్రియాలను, వీటికన్న గొప్పదైన బుద్ధిని యిచ్చాడు. ఇంతేగాక, ఆ యింద్రియాలతో అనుభవించటానికి ఎన్నెన్నో విషయాలను, సుఖాలను సృష్టిలో ఏర్పరచాడు. అట్టి పరమేశ్వరునికి కృతజ్ఞతలను తెలపటం ప్రతీ వ్యక్తికీ కనీస ధర్మం, అందుకొరకే ఈ సంధ్యావందనం ఏర్పాటు చేయబడింది. లోకంలో వివిధ సంప్రదాయాలవారు వివిధ సంధ్యావందన పద్ధతు లేర్పరచుకున్నారు. వీటన్నిటికన్న మహర్షి దయానంద సరస్వతి గారిచే సంకలనం చేయబడిన **'వైదిక సంధ్యావిధి'** విశిష్టంగా ఉంటుంది. కేవలం వేదమంత్రాలతోనే కూర్చిన ఈ సంధ్యావిధిలో తన కొరకు, పరులకొరకు, పరమాత్మకొరకు చేయవలసిన కర్తవ్యాలు తెలుపబడ్డాయి. నా రచన **"సంధ్యావందనం-వైజ్ఞానిక సమాలోచనము"** చదవండి. అందులో ఆ మంత్రాలలో ఉన్న వైజ్ఞానిక విషయాలెన్నో మీకు తెలుస్తాయి.

**43. ప్రశ్న: గురూజీ! వేదాలలో బ్రహ్మ యజ్ఞం చెయ్యాలనే నిర్దేశాలేమైనా ఉన్నాయా?**

**ఉతరం:** చాలా ఉన్నాయి. ఇంతేగాక ఆ యజ్ఞం వల్ల కలిగే లాభాలేమిటో కూడా తెలుపబడ్డాయి. ఈ క్రింది మంత్రాన్ని పరిశీలించండి :

**ఓం స తు జానాతి సుమతిం యవిష్ఠయ**
**ఈవతే బ్రహ్మణే గాతుమైరత్, విశ్వాన్యస్మై సుదినాని**
**రాయో ద్యుమ్నాన్యర్యో వి దురో అభిద్యాత్ ॥**

–ఋగ్వేదం. 4.4.16

"ఏ వ్యక్తి క్రియాశీల బ్రహ్మ కొరకు ఉదయ సాయం సంధ్యా సమయాలలో గాయత్రీ మంత్ర జపంతో స్తోత్రం చేస్తాడో అతనే దేవుని స్వరూప స్వభావాలు చక్కగా తెలుసుకోగలడు. అందుకు అనుగుణంగా తన గుణ కర్మ స్వభావాలను మార్చుకోగలడు. వేదార్థాన్ని చక్కగా తెలుసుకొని ఆ విధంగా జీవితాన్ని గడుపగలడు. అట్టివానికి అన్ని దినములు శుభదినములే ఔతాయి. ధనధాన్యాలు, ప్రతిభలు ప్రాప్తిస్తాయి. జ్ఞానవంతుడైన ఆ మనుష్యుడు నిజమైన

ఆర్యుడౌతాడు. తన ఇంటిని తోటి మానవ సమాజాన్ని చక్కగా ప్రకాశింపచేయ గలుగుతాడు" అని చెప్పబడింది.

2. **దేవయజ్ఞం:-** దేవయజ్ఞం అంటే దేవునిచే సృజించబడిన ప్రాకృతిక దేవతల కొరకు చేసే యజ్ఞం. దీనినే అగ్నిహోత్రం అంటారు. మనం సంధ్యా వందనంతో బాటు అగ్నిహోత్రం చేస్తే చాలా చాలా లాభాలు కలుగుతాయి

44. **ప్రశ్న: గురూజీ! వేదంలో దేవయజ్ఞం చెయ్యాలనే నిర్దేశాలున్నాయా?**

**ఉత్తరం:** చాలా ఉన్నాయి

ఓం **దేవం వో దేవయజ్యయాగ్ని మీళీత మర్త్యః, సమిద్ధః శుక్రదీదిహ్యృతస్య యోనిమా సదః ససస్య యోనిమాసదః ॥** ఋగ్వేదం-5.21.4

ఓ మానవులారా! మీరంతా ప్రకాశక అగ్రణీ ప్రభువైన దేవదేవుడిని దేవయజ్ఞం ద్వారా (అగ్నిహోత్రం ద్వారా) ఉపాసించండి. హోమాల ద్వారానే దేవుడు ప్రసన్నుడౌతాడు. సమిధలద్వారా ప్రజ్వలితమై ప్రకాశించే అగ్నిహోత్రంలో ఆహుతులివ్వండి. అదే - **ఋతస్య ససస్య యోని** ఔతుంది. వైదిక కర్మలకు క్షేత్రమౌతుంది" అంటుంది.

యజుర్వేదము ను ఇట్లే చెబుతుంది -

ఓం **అహరహర ప్రయావం భరంతోఽశ్వాయేవ తిష్ఠతే ఘాసమస్మై ।**
**రాయస్పోషేణ సమిషా మదంతోఽగ్నే మా తే ప్రతివేశా రిషామ ॥**

-యజుర్వేదం.11.75

ఓ మిత్రులారా! అశ్వయజమాని నిత్యం గుఱ్ఱానికి గ్రాసమేయునట్లు- గడ్డివేయునట్లు మనం నిత్యం అశ్వరూప అగ్నిహోత్రంలో ఆహుతులివ్వాలి. ఈ విషయంలో ఏమరుపాటు వద్దు. అప్పుడే జ్ఞానప్రకాశకుడైన పరమాత్మాగ్ని ప్రసన్నుడౌతాడు. మనకు పుష్కలమైన ధనధాన్యాలను, అనేక సంపదలను ఇచ్చి అభ్యుదయాన్ని కలిగిస్తాడు. క్రమంగా మనం ఆ దేవదేవుని చేరి జన్మరహితులము, మరణరహితులము ఔతాము.

"హోతృషదనం హరితం హిరణ్యయం" (అథర్వ వేదం.7.99.1) హోమం *జరుగు ఇల్లు పాడి పంటలతో బంగారంతో నిండుతుంది"* అంటుంది, -

**"ఈజానాః స్వర్గం యన్తికమ్** - అథర్వ వేదం.18.4.2

యజ్ఞం చేయువారు స్వర్గలోకాన్ని - గొప్పగొప్ప సుఖాలను పొందుతారు అంటుంది.

ఋక్ యజుర్ అథర్వ వేదాలు మూడూ ముక్త కంఠంతో **"వేదవిద్వాంసులు అలసత్వాన్ని విడిచి మేల్కొని ప్రజలచే వివిధ రకాల యజ్ఞాలను చేయించ"** మంటాయి. అగ్నిహోత్ర కార్యాలు చేయిస్తూ యజ్ఞకర్తలకు ఆయురారోగ్య ఐశ్వర్య కీర్తి ప్రతిష్ఠలు కలిగించమని అథర్వ వేదం ఆజ్ఞాపిస్తుంది.

ఓం **ఉత్తిష్ఠ బ్రహ్మణస్పతే దేవాన్ యజ్ఞేన బోధయ ।**
**ఆయుః ప్రాణం ప్రజాం పశూన్ కీర్తిం యజమానం చ వర్ధయ ॥**

-అథర్వవేదం (19.63.1)

ఓ వేద విద్వాంసులారా! మీరు అలసత్వాన్ని విడచి జాగరూకులై ప్రజలచే దేవ యజ్ఞాలను విరివిగా చేయించి ప్రాకృతిక దేవతలను తృప్తిపరచండి. యజ్ఞకర్తలకు దీర్ఘమైన ఆయువును, బలమైన ప్రాణశక్తిని, మంచి సంతానాన్ని, గో అశ్వాది పశుసంపదలను, కీర్తి ప్రతిష్ఠలను కలిగించండి అంటుంది. కనుక ఉన్నతికోరేవారంతా నిత్యాగ్నిహోత్రులు కావాలి.

## పితృయజ్ఞం

**45.** ప్రశ్న: **గురూజీ! పితృయజ్ఞం' అంటే ఏమిటి? అదొకరకమైన యజ్ఞ** ప్రక్రియనా?

**ఉత్తరం:** మిత్రులారా మనం **'యజ్ఞస్వరూపం'** అనే ప్రకరణంలో తెలిసికొన్నట్లు తనకు, ఇతరులకు మేలు చేసే మంచి పనులన్నీ యజ్ఞం అనబడతాయి. ప్రతీ మనిషీ 3 ఋణాలతో పుడతాడని శాస్త్రాలు చెబుతాయి. అవి ఏమిటంటే-

శ్లో. జాయమానో హి వై పురుషః త్రీన్ ఋణవాన్ అభిజాయతే ।
ఋణాని త్రీణి అపాకృత్య మనోమోక్ష నివాశయేత్ ॥

-ఉపనిషత్ సంగ్రహం

పురుషుడు (మనుష్యుడు) మూడు ఋణాలతో పుడతాడు. "ఆ మూడు ఋణాలను తీర్చుకున్నవాడే విశుద్ధమైన మనస్సును పొంది మోక్షాన్ని పొందటానికి అర్హుడౌతాడు" అన్నాయి శాస్త్రాలు.

**46. ప్రశ్న: ఆ మూడు ఋణాలు ఏవేవి**

**ఉత్తరం:** 1. పితృఋణం 2. దేవఋణం 3. ఋషిఋణం.

**47. ప్రశ్న: గురూజీ ! పితృఋణం అంటే..**

**ఉత్తరం:** తల్లిదండ్రులు మనకు జన్మనిచ్చి, పెంచి పెద్దచేసి ఎన్నెన్నో రకాలుగా సేవలు చేశారు. మనకొరకు ఎంతో ధనాన్ని ఖర్చు పెట్టి చదువులు చెప్పించి ఉద్యోగస్తులను చేశారు. కనుక మనం వారికి ఋణపడి ఉంటాము. అందుచే మనం వారికి అవసరమైన సేవా శుశ్రూషలు చేసి, వారి మనస్సు నొప్పించకుండా నడచుకోవాలి. వ్యాధివల్లగాని, వృద్ధాప్యం వల్లగాని వారు అశక్తులైతే వారికి అన్నిరకాల సేవలు చేయాలి. అవసరమైతే మలమూత్రాలను తీసి స్నానం చేయించాలి. బాల్యంలో వారు మనకట్టి సేవలు చేశారు కదా!

**48. ప్రశ్న: గురూజీ ! పితరులంటే మరణించినవారు కదా!**

**ఉత్తరం:** పొరబాటు. పితరులంటే జీవించి ఉన్న మాతాపితరులే. చనిపోయిన వారిని ప్రేతలంటారు.

'పిత' అనే పదము 'పా-రక్షణే' అనే ధాతువుతో (Rootతో) నిర్మించబడింది. కనుక, మనను పాలించి పోషించి రక్షించుచున్నవారందరు పితరులనబడతారు.

ప్రేతః (ప్ర+ఇతః) పూర్తిగా శరీరాన్ని వదిలిపెట్టి వెళ్ళి పోయిన జీవులనుప్రేతలనాలి.

**49. ప్రశ్న: ఎవరెవరిని పితరు లనవచ్చు?**

**ఉత్తరం:** జిజ్ఞాసువులారా ! వేదం ఏమంటుందంటే

**"పితృభ్యః స్వధాయిభ్యః స్వధా నమః**
**పితామహేభ్యః స్వధాయిభ్యః స్వధా నమః**
**ప్రపితామహేభ్యః స్వధాయిభ్యః స్వధా నమః**
**అక్షన్ పితరో౽మీ మదన్త పితరో౽తీతృపన్త పితరః**
**పితరః శున్ధధ్వమ్ ॥"** -యజుర్వేదము(19-36)

ఓ యువతీ యువకులారా! జీవించివున్న మీ మాతాపితరులకు మీ సేవలు అవసరమైనపుడు తప్పక చెయ్యండి. వారికి తగిన ఆహారాదులను

శ్రద్ధాభక్తులతో ఇస్తూ అవసరమైన సేవలుకూడా చేస్తూ తృప్తిపరచండి. సంతోషపరచండి. వీటినే శ్రాద్ధతర్పణాలంటారు. మీ మాతా పితరులకేగాక మిమ్ము ఆశ్రయించుకొని ఉన్న తాతలకు, ముత్తాతలకు, అత్తమామలకు, బంధువులకు కూడా సేవలు చేయండి.

గురువులకు, ఉపదేశకులకు, సాధు సన్యాసులకు కూడా సేవలందించాలి. అట్టివారిని తృప్తిపరచి, వారి ఉపదేశాలతో మీరు తృప్తులు కావాలి" అంటుంది. దీనినే పితృయజ్ఞము అంటారు. **స్వధా** అంటే శుద్ధమైన ఆరోగ్యకరమైన ఆహారమని అర్థం. మృత పితరులకు పెట్టే తద్దినాలు కాదు, పిండాలు పెట్టడంకాదు. శ్రాద్ధము అంటే శ్రద్ధా భక్తులతో సేవలు చేయటం. తర్పణమంటే తృప్తిపరచటం ఇవి బ్రతికున్న వారికి వర్తిసాయి కాని చనిపోయిన వారికికాదు. ఇలా చేసినప్పుడే పితరుల ఋణం తీరుతుంది.

**"శ్రద్ధయా విందతే వసు"** - ఋ. 10.151.4

అంటుంది వేదం. అంటే - శ్రద్ధతో సేవా సుశ్రూషలు చేసేవారికి అనేక రకాల వసువులు -ధనాలు ప్రాప్తిస్తాయట.

## 4. బలి వైశ్వదేవ యజ్ఞం

లోకంలో **'బలి'** పదము వికృతార్థానికి గురి అయ్యింది. **'బలి'** అంటే భరణపోషణలు చేసేదని అర్థం.

**50. ప్రశ్న: గురూజీ! మేకలను, కోళ్ళను కాళికా దేవికి బలి యివ్వటాన్ని బలి అంటారు కదా?**

**ఉత్తరం:** సరియైన వ్యాకరణ జ్ఞానంలేని వారు అలా అర్థం చేసుకున్నారు. పూర్వం పౌరాణిక విద్వాంసులు కూడా యజ్ఞం పేరిట, హెూమం పేరిట జంతువులను చంపి హెూమంలో అహుతులిచ్చేవారట. యజ్ఞశాలలు పెద్ద పెద్ద కబేళాలుగా మారిపోయినవట. ఆ సమయంలోనే మహాత్మా బుద్ధుడు చలించిపోయి మేకకు బదులు నన్ను బలి యిచ్చి హెూమం చేసుకోండన్నాడట. అహింసయే - ఏ ప్రాణిని హింసించకుండటమే పరమ ధర్మ మన్నాడట. ఈ మాటలు ఆనాటి వివేకవంతులలో ఆలోచనలను రేకెత్తించాయి. చాలా మంది **"అహింసయే పరమ ధర్మ"** మంటూ అతని అనుయాయులైపోయారు. ఔను. దేవుని చేర్చే మార్గాన్ని బోధించే **'యోగదర్శనం'** కూడా యమనియమాలే

మొదటి రెండు మెట్లు అంటుంది.

**51. ప్రశ్న : యమ నియమాలంటే ఏవేవి గురూజీ ?**

**ఉత్తరం: "అహింసా సత్యాస్తేయ బ్రహ్మచర్యాపరిగ్రహో యమాః** (యోగదర్శనం 2-30) అహింస, సత్యము, దొంగిలించ కుండుట, బ్రహ్మచర్యము, అపరిగ్రహము అవసరానికి మించి ధనాన్ని, వస్తువుల సంగ్రహించకుండటం అను 5 యమములంటారు"

**"శౌచ సంతోష తపః స్వాధ్యాయేశ్వర ప్రణిధానాని నియమాః** (యోగదర్శనం 2.32) = బాహ్యాభ్యంతర శుచి శుభ్రతలను పాటించటం, సంతోషంగా తృప్తిగా ఉండటం, తపస్సు, స్వాధ్యాయము, ఈశ్వర ప్రణిధానము అను 5 విషయాలను కలిగి ఉండటాన్ని నియమము లంటారు. వీటిని గురించి యోగదర్శనంలో చదవండి. వీటిలో మొట్టమొదటిదైన 'అహింస' గురించి ఇక్కడ కొద్దిగా తెలుసుకుందాము అహింస అంటే **"సర్వథా సర్వదా సర్వభూతానామ్ అనభిద్రోహః=** మనోవాక్కాయాలతో ఏ ప్రాణిని ఎప్పుడునూ ఏ విధంగాను హింసించ కుండా ఉండటం. ఇంతేగాక, సర్వప్రాణులను మిత్రదృష్టితో చూడటం. మిత్రదృష్టితో వ్యవహరించటం" అని మహర్షులు నిర్వచించారు. బలి అనే పదము సంస్కృత పదము. ఇది **"భృ భరణే, భృఞ్ - ధారణ పోషణయో"** అనే ధాతువులతో నిర్మించబడుతుంది. ప్రాణులను భరణ ధారణ పోషణలు చేసేది ఆహారమేకదా ! మాంసాహార వ్యసనపరులు మాంసమునే భోజనమనుకొని ఈ పదమును వాడుకొని ఉండవచ్చు.

**గోషు ప్రశస్తిం వనేషు ధిషే భరన్త విశ్వేబలిం స్వర్ణః**

- (ఋ 1-70-5)

ఓదేవా! నీవు గో అశ్వాది పశువులలో మంచి గుణాలను ధరింపచేస్తావు. అందరు మా కొరకు (బలిం) ఉత్తమ కానుకలను తెచ్చెదరు గాక" అని సాయణాచార్యులవారు

అర్థం వ్రాశారు. కనుక, బలి అనే పదమునకు మరొక అర్థం కానుకలు, పన్నులు (taxes). గ్రిఫిత్, విల్సన్ అనే విదేశీ సంస్కృత పండితులు 'బలి' పదమునకు అని అర్థాలు వ్రాశారు. వేదంకూడా దీనిని సమర్థిస్తుంది.

**1. తస్మై బలిం రాష్ట్రభృతో భరన్తి"** (అథర్వ 10-8-15)

రాష్ట్రప్రజలు ఆ రాష్ట్రపతికి (లేదా రాజునకు) పన్నులు ఇవ్వాలి

2. "ఇమా విశో అభిహరస్తు తే బలిమ్" (అథర్వ 19-45-4)

ఈ ప్రజలు నీకు పన్నులు చెల్లింతురుగాక, ఈ విధంగా మన వేదాలలో బలి పదము ఉంది. జంతువులను వధించటం బలికాదు.

52. **ప్రశ్న: గురూజీ! మరి బలి వైశ్వదేవ యజ్ఞంలో బలి అంటే ఏమిటి ? వైశ్వదేవమ్' అంటే ఏమిటి?**

**ఉత్తరం:** ఇక్కడ బలి అంటే పోషించే అన్నము (ఆహారము) అని అర్థం. వైశ్వదేవం - అంటే తోటి ప్రాణులకు పెట్టటం అని అర్థం. విశ్వంలోని ప్రాణులన్నిటితోను మనకు సంబంధం ఉంటుంది. ఎట్లంటే మనము విశ్వంలోని సకల ప్రాణులు మూలతః జీవాత్మలమే. ప్రస్తుతం మనం ఈ శరీరంలో ఉన్నాము ఈ భావాన్ని జీర్ణం చేసుకొని హృదయాన్ని విశాలం చేసుకుంటూ అన్ని ప్రాణులు తనవంటి వేనని గుర్తించాలి. మనం భోజనం చేసేముందు మనను ఆశ్రయించుకొని ఉన్న గోవులకు, కుక్కలకు కొన్ని ముద్దలు ప్రక్కకు తీసి పెట్టి లేదా వాటికి పెట్టి మనం భోజనం చెయ్యాలి. బలివైశ్వదేవయజ్ఞనానికి మరొక పేరు **భూతయజ్ఞం.** ఇక్కడ భూతములంటే ప్రాణులని అర్థం. దెయ్యాలు, భూతాలు కాదు. అట్టివి అసలు ఉండనే ఉండవు. భయస్థులు ఆ విధంగా ఊహించుకుంటూ భయపడతారు. అట్లే ఆకలిగొన్న భిక్షకులకు, రోగులకు మన శక్తి కొలది అన్నదానం చెయ్యాలి.

53. **ప్రశ్న: గురూజీ ! బలివైశ్వదేవ యజ్ఞం చెయ్యాలని ఏవైనా వేద నిర్దేశాలున్నాయా?**

**ఉత్తరం:** ఉన్నాయి -

"ఓం **స ఇద్ భోజో గృహవే దదాత్యన్న కామాయ చరతే**
**కృశాయ, అరమస్మై భవతి యామహుతా ఉతాపరీష**
**కృణుతే సఖాయమ్ ॥.** -ఋగ్వేదం (10-117-3)

ఎవరైతే ఆకలితో ఇంటి ముందుకు వచ్చిన భిక్షుకునకు అన్నదానం చేస్తాడో అతడే నిజమైన దాత. అట్టివానికే లోకంలో గౌరవం, సన్మానం కలుగుతుంది,పుణ్యజీవియై ఉత్తమ జన్మను పొందుతాడు. అతని విరోధులు కూడా అతనిని మిత్రుని చేసుకోగోరుతారు. దానశీలునకు శత్రువు లెవరుంటారు?

ఋగ్వేద 10వ మండలంలోని 117వ సూక్తాన్ని భిక్షుసూక్తమని, ధన అన్నదాన ప్రశంసా సూక్తమని లోకంలో వ్యవహరిస్తారు. 9 మంత్రాలు గల ఈ సూక్తమంతా దానాన్ని ప్రోత్సహిస్తుంది. దాత గర్వించకూడదంటుంది. కేవలం ఆకలితో మరణించేవారు చాలా అరుదు అంటుంది. ధనం ఒక రథ చక్రం వంటిదనీ, అది ఒకరి దగ్గర నుండి మరొకరి దగ్గరికి తిరుగుతూనే ఉంటుందనీ, మీ చేతిలో ఉన్నపుడే దానధర్మాలు చేసుకొని పుణ్యం మూటగట్టుకోమంటుంది. ఈ బలివైశ్వదేవ యజ్ఞాన్ని గురించిన విధివిధానాలు 'వైదిక దినచర్య పుస్తకాలలో ఉంటాయి. అది నేర్చుకొని ఆ విధంగా చేస్తే మనకు చాలా మేలు కలుగుతుంది.

## అతిథి యజ్ఞం

54. **ప్రశ్న: అతిథి యజ్ఞం ఎలా చెయ్యాలి?**

**ఉత్తరం: అతిథియజ్ఞం:** ఎవరి రాకకు తిథి – ఏ రోజు, ఏ సమయంలో వస్తున్నానో చెప్పకుండా అకస్మాత్తుగా ఇంటికివచ్చే సన్న్యాసులను, మహాత్ములను వేదధర్మ ప్రచారకులను మాత్రమే అతిథులనాలి. తిథి (Date) సమయాలు చెప్పి వచ్చేవారిని బంధుమిత్రు లనాలి. పూర్వకాలంలో వేదశాస్త్రాలు, ధర్మసూత్రాలు పూర్ణంగా చదువుకొన్న వారు లోకోపకారార్థం వాటిని ప్రచారం చెయ్యటానికి సన్న్యాసాశ్రమం స్వీకరించేవారు. వారి రాకపోకలను ఎవరికీ తెలిపేవారు కాదు. తమకు ఆకలైనపుడు ఏ గృహస్థుని అరుగుపైననో కూర్చొనేవారు. గృహస్థులు సంధ్యా అగ్నిహోత్ర, పితృ, బలివైశ్వదేవ యజ్ఞాలు చేసిన తదుపరి వారు భోజనం చేసేముందు ఒకసారి వాకిలి తెరచి తన అరుగుపై ఎవరైనా సన్న్యాసులు, మహాత్ములు కూర్చున్నారేమో నని పరిశీలించేవారు. అటువంటి వారు ఉంటే గృహస్థులు సాదరంగా వారిని లోనికి ఆహ్వానించి అర్ఘ్య పాద్య ఆచమనాల కొరకు వేరువేరుగా జలాలనిచ్చి, ఉన్నతాసనం పై కూర్చుండబెట్టి వారికి తృప్తిగా భోజనం పెట్టాలి. తగిన సేవలు చేసి వారితో సత్సంగం జరపాలి. ధర్మ సందేహాలేమైనా ఉంటే అడిగి తెలుసుకోవాలి. అతిథులంటే కేవలం సన్న్యాసులే కానక్కరలేదు. సమయాన్ని బట్టి ఎవరైనా ఉత్తమ వానప్రస్థి, ధర్మప్రచారకులు, గృహస్థులు కూడా కావచ్చు. అయితే వారు ధర్మం చక్కగా తెలిసిన వారు నిష్కపటులు, పక్షపాత రహితంగా

ధర్మోపదేశం చేయగలవారు అయివుండాలి. కాని, పాషాండులు, వేదనిందకులు, స్వార్థపరులు కుక్షింబరులు, శఠులు, హఠులు అయిన కపట సాధు సన్న్యాసుల నెంత మాత్రం సత్కరించకూడదు.

**55. ప్రశ్న: గురూజీ! అతిథి యజ్ఞం చెయ్యాలనే నిర్దేశాలు వేదాలలో ఏమైనా ఉన్నాయా?**

ఉత్తరం: ఉన్నాయి

**1. యద్ వా అతిథి పతిరతిథీన్ ప్రతిపశ్యతి దేవయజనం ప్రేక్షతే**

(అథర్వ 9-6-(1)-3)

అతిథి సత్కారం చేయు గృహపతి దేవయజ్ఞం చేసినవాడగును

**2. ఇష్టం చ వా ఏష పూర్తం చ గృహాణామశ్నాతి యః పూర్వోఽతిథేరశ్నాతి.**

-(అథర్వ 9-6-(3)-1)

అతిథికి భోజనం చేయించక అతనికన్న ముందు భుజించువాడు తన యింటి మేలును, సమృద్ధిని తానే తినుచున్నాడు. నాశనం చేసుకుంటున్నాడు.

దీని భావమేమంటే - "అతిథి భోజనం చేయకుండా ఆకలితో వెళ్ళిపోతే గృహస్థునకు పాపం అంటుకుంటుంది. అతని ఇల్లు అనేక రకాలుగా నష్టపోతుంది" అని అర్థం.

**56. ప్రశ్న: గురూజీ! ఈ ఐదింటిని మహా యజ్ఞాలన్నారు కదా (బ్రహ్మ యజ్ఞము, దేవ యజ్ఞము, పితృయజ్ఞము, బలివైశ్వదేవ యజ్ఞము, అతిథి యజ్ఞము) ఇవి మహా యజ్ఞాలెట్లవుతాయి. వీటివల్ల కలిగే ప్రయోజనాలను, నష్టాలను సంక్షిప్తంగా మాకు అర్థం అయ్యేటట్టు చేప్పండి.**

**ఉత్తరం:** అవును మిత్రులారా! సంక్షిప్తంగా వీటి ముఖ్య ప్రయోజనాలేమిటో చెబుతాను. శ్రద్ధగా వినండి. ఈ అయిదింటిని మహా యజ్ఞాలనటానికి కారణం లక్షలు ఖర్చు పెట్టి చేసే పెద్ద పెద్ద యజ్ఞాలనికాదు. వీటిని స్వల్పమైన ఖర్చుతోనే సునాయాసంగా చెయ్యవచ్చు ఇచ్చట యజ్ఞం అంటే - కర్తవ్యపాలన అని చెప్పవచ్చు. పూర్వ పుటలలో చెప్పుకొనినట్లు ముఖ్యంగా మానవుడు 3 ఋణాలను (అప్పులను) కలిగి ఉంటాడు. వాటిని శక్తికొలది తీర్చుకొనే ప్రయత్నం చెయ్యాలి, లేకుంటే **'ప్రత్యవాయ'** మనే పాపం వస్తుందని భగవద్గీత చెబుతుంది -

శ్లో॥ నేహాభిక్రమ నాశోఽస్తి ప్రత్యవాయో న విద్యతే ।
స్వల్పమప్యస్య ధర్మస్య త్రాయతో మహతో భయాత్ ॥

-(భ.గీ.2-40)

ఓ అర్జునా! ఈ కర్మయోగము ననుసరించటంవల్ల మానవులు కర్తవ్యములను విడవవలసిన అవసరముండదు. కర్తవ్యకర్మలను విడిచిపెట్టి సంన్యాసం తీసుకుంటే అది **'అజ్ఞాన సంన్యాసం'** అవుతుంది. దానివల్ల **'ప్రత్యవాయం'** అనే పాపం కలుగుతుంది. అలా కాకుండా కర్మయోగి అయితే ప్రత్యవాయం అనే పాపం కలుగకుండా ఉంటుంది.

కర్మయోగశీలురు తన శక్తికొలది స్వల్పంగా ఆచరించినా అతి పెద్దదైన మృత్యుభయాన్నుండి రక్షిస్తుంది. ఆత్మజ్ఞానాన్ని కలిగించి అమరుణ్ణి చేస్తుంది. ముక్తిని కలిగిస్తుంది.

(ప్రత్యవాయం అనే పదము పారిభాషిక పదము. పితృఋణము., దేవ ఋణము, ఋషిఋణము అనే మూడు ఋణాలు మనకు మానవ జన్మతోనే వస్తాయి. ఆ భాద్యతలను తప్పించుకోవటానికి సన్యాసం స్వీకరించే సోమరులకు పాపం కలుగుతుంది. అట్టి దానిని ప్రత్యవాయ పాపం అంటాయి మన శాస్త్రాలు.)

**57. ప్రశ్న: గురూజీ! ప్రసంగం వచ్చింది కదా! అసలు కర్మయోగం అంటే ఏమిటి? సంక్షిప్తంగా తెలుపండి.**

**ఉత్తరం:** సుఖదుఃఖాలను, హానిలాభాలను, జయాపజయాలను, మానావ మానాలను లెక్కించక తన కర్తవ్యాలను పాలించటం; ఏ ఫలితాలు కలిగినా పరమేశ్వర ప్రసాదాలుగా భావించి సంతోషంగా స్వీకరించటాన్ని కర్మయోగం అంటారు. దీనితో బాటు శక్తి కొలది కొన్ని పరోపకారాది సత్కర్మలు చేస్తూ వాటి వల్ల కలిగే పుణ్యఫలాలను ఈశ్వరార్పణ చేస్తూ, నాకు ముక్తి తప్ప మరే లౌకిక సుఖాలు వద్దు అనే భావాన్ని కలిగి ఉంటే క్రమంగా అతని పాపాలన్నీ క్షయించి ఆత్మజ్ఞానం కలుగుతుంది. యోగాభ్యాసం చేస్తూ ఉంటే క్రమంగా ఆత్మ పరమాత్మల సాక్షాత్కారం కలుగుతుంది పరమానందం ప్రాప్తిస్తుంది.

58. ప్రశ్న: గురూజీ! యోగా భ్యాసం అంటే ఏమేమి చెయ్యాలి?

**ఉత్తరం:** జిజ్ఞాసువులారా! ఇది చాలా పెద్ద విషయం. దీనిని మరొక పుస్తకంలో తెలుసుకుందాము. అంతవరకు మీరు తరచుగా **'ఈశావాస్యోపనిషత్తు'** చదువుతూ ఉండండి. భగవద్గీత వైదిక వ్యాఖ్యానాలు కూడా చదువుతూ ఉండండి. ఇక మనం పంచ మహాయజ్ఞాల సారాంశం ఏమిటో తెలుసుకుందాం.

## పంచ మహా యజ్ఞాల సారాంశం

వేదాలలో ఈ పంచ మహాయజ్ఞాలు గృహస్థులు విధిగా చెయ్యాలని చెప్పబడింది. మానవ జీవితానికి ఈ అయిదు యజ్ఞాలు **మహాకర్తవ్యాలు.** వీటిని ఎవరి శక్తికొలది వారు ఆచరిస్తే మానవ సమాజం సుఖశాంతులతో వర్ధిల్లుతుంది. ప్రతిదినం **బ్రహ్మయజ్ఞం (సంధ్యావందనం)** చేసుకుంటే - ఎక్కువ సమయం ఉపాసన చేసుకుంటే మనుష్యుని ఆత్మ బలిష్ఠమవుతుంది. పర్వతంవంటి దుఃఖం ఎదురైనా చలించక నిర్భయంగా ఎదుర్కొంటాడు. ఇది సామాన్యవిషయం కాదు. ఈశ్వరుడు సర్వవ్యాపకుడనీ, అత్యంత న్యాయకారియనీ అవగత మౌతుంది. ఆత్మ విశ్వాసం, పరమాత్మవిశ్వాసం అధికమౌతూ ఉంటాయి. పాపాలు తనలో చొరబడకుండా ఉంటాయి.

ప్రతిదినం దేవయజ్ఞం - దైనిక అగ్నిహోత్రం చేసుకుంటే ఇల్లు శుద్ధమౌతుంది. బలారోగ్యాలు వృద్ధి చెందుతాయి. ఈ హోమవాయువు తన యింటినే కాక పరిసరాలను కూడా పవిత్రం చేస్తుంది. దానివల్ల కొంత పరోపకారం జరుగుతుంది.

ప్రాచీన కాలంలో వలె ప్రతియింట దైనిక అగ్నిహోత్రం జరుగుతూవుంటే, పూర్వీకులవలె మనం కూడా దీర్ఘాయుష్కులము, బలిష్టులము, నిరోగులము కాగలుగుతాము.

నేడు లోకాన్ని పట్టి పీడిస్తున్న అనేక వ్యాధులు పారిపోతాయి. అలా చేయకపోతే క్రమంగా వాతావరణం కలుషితమై మానవ మనుగడ ప్రశ్నార్థకం అవుతుంది. తల్లిదండ్రులకు, అశక్తులైన వృద్ధులకు సేవచేయుటకే పితృయజ్ఞం ఏర్పాటుచేశారు మహర్షులు. యువావస్థలో వారు మనకు, సమాజానికి ఎన్నెన్నో సేవలు చేశారు కనుక వారికి సేవచేయటం మన కర్తవ్యం. అలా చేయకపోతే

కృతఘ్నుతా పాపం వస్తుంది. మనం ముసలివారమైనపుడు మనకు మన పిల్లలు చేయరు. బలివైశ్వ, అతిథి యజ్ఞాలు కూడా అవసరమే. వాటివల్ల మన హృదయం విశాల మౌతుంది. పాప ప్రక్షాళన మవుతుంది. ముందు తరాలకు మనం ఆదర్శమౌతాము. సమసమాజము, నాగరిక సమాజము, జ్ఞాన విజ్ఞాన భరిత సమాజము, సభ్యతా సంస్కృతుల సమాజము ఏర్పడతాయి. భారతదేశం భూలోక స్వర్గ మౌతుంది.

**59. ప్రశ్న: గురూజీ! ఇది నిజమా? నమ్మలేకుండా ఉన్నాము**

**ఉత్తరం:** మిత్రులారా! ఇది పూర్తిగా నిజం. సృష్ట్యాది నుండి మహాభారతకాలం వరకు భారతీయ ఏకచ్ఛత్రాధిపత్యమే ఈ భూమండలమంతా ఉండేది. ప్రపంచానికి గురువుగా ఉండేది. సకలవిద్యలతో బాటు సభ్యతా సంస్కృతులను, రీతి నీతులను ఉపదేశించే ఆదర్శ రాజ్యంగా ఉండేది. మహర్షి దయానందులవారు వ్రాసిన జగత్ప్రసిద్ధ సత్యార్థ ప్రకాశం 11వ సముల్లాసంలోని మొదటి 4,5 పేజీలు చదివితే చాలు మన ఔన్నత్యం ఏమిటో మనకు అర్థమౌతుంది.

(ఈ పుస్తకాలు ప్రతి ఆర్యసమాజ మందిరాలలోను లభిస్తాయి)

**60. ప్రశ్న:- గురూజీ! మన గురించి మన శాస్త్రాలలో చాలా విషయాలే ఉండి ఉండవచ్చు. కాని, ఈ విషయాలు విదేశీయులెవరైనా గుర్తించారా?**

**ఉత్తరం:** జిజ్ఞాసువులారా! మీ అభిలాషకు నా అభినందనలు. ఇట్టి జిజ్ఞాస కలవారే జ్ఞానవంతులౌతారు. వివేకవంతులౌతారు. మన దేశం గురించి విదేశీ యాత్రికులు చాలా చాలా విషయాలే వ్రాశారు. వారిలో ఉన్నత విద్యావంతులు పండితులు, తత్వవేత్తలు (Philosophers) వ్రాసిన కొన్ని విషయాలను సంక్షిప్తంగా ఇక్కడ తెలుసుకుందాము.

కుటిల రాజనీతిజ్ఞులైన ఆంగ్లేయులు భారతీయుల ఈ ఔన్నత్యాలన్నిటికి మూలకారణం వేదాలని గ్రహించారు. ఆ వేదాలు అనాగరిక ఆటవికులు పాడుకున్న పిచ్చిపిచ్చి పాటలని నేటి తరానికి చెప్పగలిగితే శాశ్వతంగా భారతీయులు మనకు బానిసలౌతారని గుర్తించారు. ముందుగా జర్మనీ సంస్కృత పండితులైన మాక్స్ మూలర్ పండితుని తమ ఇంగ్లాండు దేశానికి సాదరంగా

ఆహ్వానించి తమ ఆలోచనను చెప్పి అందుకు తగినట్లుగా వేదభాష్యం వ్రాయమని వేడుకున్నారు. ప్రలోభాలకు వశుడై మాక్స్ ముల్లర్ పండితుడు ఒప్పుకున్నాడు. అతడు అందుకు తగిన భారతీయుల వేదాలను, వాటి భాష్యాలను ఇంగ్లాండుకు తెప్పించుకొని అధ్యయనం చేయసాగాడు. అతడు వైదిక వ్యాకరణం చదువుకోలేదు. కనుక నేరుగా వేదాలను చదువుకొని అర్థం చేసుకోలేకపోయాడు. అతనికి లభించిన సాయణాచార్య భాష్యం చదువుకుంటూ దాని ఆధారంతో ఆంగ్లంలో భాష్యం వ్రాశాడు. సాయణాచార్యులుకూడా సాంగోపాంగ వేదాధ్యయనం చేయలేదు. సామాన్య లౌకిక వ్యావహారిక సంస్కృతం మాత్రమే చదువుకున్నాడు. కనుక అతని భాష్యం ప్రామాణికం కాదు.

## సాఙ్గోపాఙ్గ వేదాధ్యయనం

**61. ప్రశ్న: గురూజీ! "సాంగోపాంగ వేదాధ్యయనం" అంటే ఏమిటి ? సంక్షిప్తంగా తెలుపండి గురూజీ**

**ఉత్తరం:** జిజ్ఞాసువులారా! వేదాలు సరిగా అర్థం కావాలంటే ముందు వేదాంగాలను క్షుణ్ణంగా చదువుకోవాలి. ఇవి ఆరు పుస్తకాలు-

శ్లో॥ **శిక్షా కల్పో వ్యాకరణం నిరుక్తం ఛన్దసాం చ యః ।**
**జ్యోతిషామయనం చైవ వేదాంగాని షడేవ తు ॥**

**1.** శిక్షా :- ఏ అక్షరాన్ని ఎలా పలకలో చాలా వివరంగా చెబుతుంది.

**2.** **కల్పము:-** రకరకాల యజ్ఞ యాగాది క్రతువులను, అనుసరించవలసిన విధి విధానాలను వివరిస్తుంది.

**3.** **వ్యాకరణం:-** సంస్కృత పదముల మూల పదములను (Roots) వాటి అర్థాలను, ప్రత్యయములను, సంధి సమాసాలను వివరంగా తెలుపుతుంది.

**4.** **నిరుక్తం:-** పదముల విశేషార్థాలను నిర్వచిస్తుంది. "Definitions"ను చెబుతుందన్నమాట.

**5.** **ఛందస్సు:-** మంత్రముల (పద్యముల) వివిధ ఛందస్సులను తెలుపుతుంది

6. **జ్యోతిషము:-** జ్యోతి అంటే ప్రకాశము అని అర్థం. విశాల ఆకాశంలో ప్రకాశించే గ్రహగోళాల వివరాలు, లెక్కలు ఇది చెబుతుంది. కాని, నేడు లోకంలో ప్రచలితమైన ఫలిత జ్యోతిషం కాదు సుమా! అవన్నీ కేవలం కల్పితాలు. ఈ ఆరింటిని బాగా అధ్యయనం చేస్తేనే వేదార్థం బోధపడుతుంది. ఈ ఆరూ పునాదులుగా ఉంటాయి.

## ఉపాంగాలు

62. **ప్రశ్న: గురూజీ! అలాగే ఉపాంగాలను గురించి కూడా చెప్పండి.**

**ఉత్తరం:** ఇవియును ఆరే (6). కళ్ళజోళ్లవలె వేదార్థాన్ని మరింత స్పష్టంగా అర్థం చేసుకోవడానికి ఇవి సహరిస్తాయి. వీటిని లోకంలో దర్శనాలని వ్యవరిస్తారు. షడ్దర్శనాలు అంటారు.

1. **వైశేషికము:-** ఇది సృష్టిలోని పదార్థాలను, వాటిలోని గుణాలను, ప్రకృతిలో నెలకొని ఉన్న నియమాలను తెలుపుతుంది. ఇది ఒకరకమైన ఫిజిక్స్, కెమిస్ట్రీ గ్రంథం. దీని రచయిత కణాదుడు. ఇతడు మహర్షి, చాలా తపస్వి, అపరిగ్రహవ్రతుడు. రైతులు పంటలను కోసుకొని ఇంటికి తీసుకువెళ్ళిపోయిన తదుపరి అక్కడక్కడ రాలిపోయిన గింజలను ఏరుకొని తింటూ పక్షులవలె జీవించాడు. అందుచే ఆయనను కణాదుడన్నారు

2. **న్యాయదర్శనం:-** ఇది ఒక తర్కశాస్త్రం ("Indian Logic") దీని రచయిత గౌతమ మహర్షి. సత్యాసత్యాలను నిశితంగా పరీక్షించే విధి విధానాలను ఇది తెలుపుతుంది. హేతు బద్ధతతో పరీక్షించి సత్యనిర్ణయం చేసే పద్ధతులను ఇది వివరిస్తుంది. ఆంగ్లేయ న్యాయశాస్త్రాలకన్న ఇది 100 రెట్లు గొప్పది.

3. **సాంఖ్యదర్శనం:-** సృష్టిలో స్థూల పదార్థాలతో బాటు కొన్ని సూక్ష్మ పదార్థాలు కూడా ఉన్నాయి. వీటన్నిటికి మూలం ప్రకృతి. ఇక్కడ ప్రకృతి అంటే మనం చూసే ప్రకృతి కాదు. వీటికి మూలమైన పరమాణు రాశి అని అర్థం. ఈ పరమాణువులతో బాటు జీవులు, పరమాత్మ కూడా ఉంటారు. పరమాత్మ మూలప్రకృతిని (పరమాణువులను) వివిధ నిష్పత్తులలో కలిపి కనబడే సృష్టిగా నిర్మించాడు. ఈ సృష్టి ఎందుకు చేసేడంటే జీవులకొరకు. నేను, నేను అని వ్యవహరించే మనమే ఆ జీవులము. మన శుభాశుభకర్మలకు

తగినట్టు రకరకాల శరీరాలను నిర్మించి మనకిస్తాడు. ఈశాస్త్రం మూల తత్త్వాలైన ప్రకృతి, జీవ, పరమాత్మల గురించి లోతుగా వివరిస్తుంది.

4. యోగదర్శనం:- దీని రచయిత పతంజలి మహర్షి, ఇది ప్రపంచ మేధావులను, తత్త్వవేత్తలను ఆకర్షించిన అద్భుత గ్రంథం. నేడు యోగా దినంగా పాటిస్తూ చేసే ఆసన ప్రాణాయామాలకు ఈ గ్రంథమే మూలం. అయితే, ఈ గ్రంథంలో చెప్పింది కేవలం ఆసన ప్రాణాయామాలేకాదు. **ప్రత్యాహార, ధారణా, ధ్యాన, సమాధు** లనే 4 అంగాలు ముఖ్యం. ఆ మార్గంలో పయనించి ఆత్మ పరమాత్మల సాక్షాత్కారం పొందాలి. పరమాత్మలోని అనిర్వచనీయమైన ఆనందామృతాన్ని కడుపునిండా త్రాగాలి. ఆ అనందాన్ని పోల్చటానికి మరే ప్రాపంచిక ఆనందము సరిపోదు. ఒక యోగి ఏమన్నారంటే -

**సమాధి నిర్ధూత మలస్య చేతసో**
**నివేశితస్యాత్మని యత్సుఖం భవేత్,**
**న శక్యతే వర్ణయితుం గిరా**
**తదా స్వయం తదన్తః కరణేన గృహ్యతే ॥**

తా: స్థిర సమాధిచే నిర్మలమైన చిత్తంతో ఆత్మ పరమాత్మలను *దర్శించినపుడు (సాక్షాత్కారం పొందినపుడు)* కలిగే ఆ అతీంద్రియ సుఖాన్ని *వర్ణించటానికి నా మాటలు చాలవు. ఎవరంతట వారే దానిని దర్శించి అనుభవించ వలసిందే"* అన్నాడు. తదుపరి వచ్చిన యోగులు కూడా అట్లే చెప్పారు.

కనుక, ఏ వేదశాస్త్రాలూ చదవలేకపోయినా మానవుడై పుట్టిన ప్రతీ వ్యక్తి ఈ గ్రంథాన్ని తప్పక చదవాలి. సాధన చెయ్యాలి.

5. మీమాంసా దర్శనం:- దీనిని పూర్వ మీమాంస అని కూడా అంటారు. దీని కర్త వ్యాసమహర్షి శిష్యుడైన జైమిని మహర్షి. ఈ దర్శనం విశేష యజ్ఞయాగాది క్రతువుల గురించి వివరించి, వాటివల్ల కలిగే విశేష ప్రయోజనాలను చెబుతుంది. ముఖ్యంగా యజ్ఞంలో (హోమాలలో) వేదమంత్రాలను ఏకస్వరపాఠం చెయ్యవచ్చునంటుంది. స్త్రీలకు, నిషాధులకు కూడా యజ్ఞం చేసే అధికారం ఉందని చెబుతుంది. **"మాంసపాకష ప్రతిషేధః**

(మీ. 12-2-2)" మాంసం అన్ని విధాల నిషేధించదగినదని నొక్కివక్కాణి స్తుంది.

6. వేదాంత దర్శనం :- దీనిని 'ఉత్తర మీమాంస' అనికుడా అంటారు. దీని కర్త మన వ్యాసమహర్షియే.

"అథాతో బ్రహ్మ జిజ్ఞాసా (వే.ద. 1-1-1)"

అంటూ ప్రారంభమైన ఈ దర్శనం బ్రహ్మను గురించి - పరమాత్మను గురించి అన్ని కోణాలనుంచి పరీక్షించి-

జన్మాదస్య యతః (వేద. 1-1-2)"- ఈ సృష్టి స్థితి లయాల మూడింటిని ఆ ఏకేశ్వరుడే చేస్తున్నాడంటుంది.

"శాస్త్ర యోనిత్వాత్ (1-1-3) అంటూ చతుర్వేదాలకు

మూలం కూడా ఆ ఏకేశ్వరుడే" నంటుంది. అతని నుండి వచ్చినవే అంటుంది.

## సంఘటనం - సమానత్వం

**63. ప్రశ్న:- గురూజీ! మానవుల ఉన్నతికి మీరు చెప్పిన పంచ మహాయజ్ఞాలు చేసుకుంటూ పవిత్రంగా జీవిస్తే సరిపోతుందా? లేక మరేవైన విశేష కర్మలున్నాయా?**

**ఉత్తరం:-** జిజ్ఞాసువులారా! ఈ కర్మలతోబాటు చేయవలసిన మరెన్నో కర్మలున్నాయి. వాటిలోని కొన్నిటిని మనం ఇక్కడ తెలుసుకుందాము - మానవుడు సామాజిక ప్రాణి. అన్ని అవసరాలు తానొక్కడే పూర్తి చేసుకోలేడు. పరస్పర సహకారంతోనే జీవించవలసి ఉంటుంది. ఉదా : తాను తినే ఆహారం రైతులు పండించవలసి ఉంటుంది. ధరించే వస్త్రాలు నేతగాండ్రు తయారు చేయవలసి ఉంటుంది. ఈ విధంగానే మిగిలిన పాత్రలు, మంచాలు, కుర్చీలు, బల్లలు మొదలగునవన్నీ ఇతరులు తయారు చేయవలసి ఉంటుంది. కనుక, మానవ మనుగడ పరస్పర సహకారంతోనే సాగుతుంది. అందు చేతనే వేదం సంఘటిత జీవితం గడపమంటుంది. అన్ని వృత్తులను, వర్ణాలను సమానంగానే తగిన విధంగా గౌరవించమంటుంది.

**64. ప్రశ్న: గురూజీ! ఈ విషయంలో వేద మేమంటుంది?**

**ఉత్తరం:** మిత్రులారా! జ్ఞానకాండను బోధించే విశాల ఋగ్వేదంలోని అంతిమ సూక్తం ఈ సమానత్వ విషయం స్పష్టంగా చెబుతుంది. ఈ సూక్తంలో

కేవలం 4 మంత్రాలే ఉన్నాయి కనుక అన్నిటికి సంక్షిప్తంగా అర్థం తెలుసుకుందాము.

## సంగఠన సూక్తం

**1.** ఓం సం సమిద్యువసే వృషన్నగ్నే విశ్వాన్యర్య ఆ
ఇడస్పదే సమిధ్యసే స నో వసూన్యా భర ॥

ఓ సర్వవ్యాపక సర్వేశ్వర! నీవు సర్వ శక్తి మంతుడవనీ, సృష్టి కర్తవనీ, సర్వైశ్వర్య కర్తవనీ వేదాలు ఘోషిస్తున్నాయి. కనుక మా అందరకు అవసరమైన ఉత్తమ ధనాలను ప్రసాదింపుము.

**2.** సంగచ్ఛధ్వం సంవదదధ్వం సం వో మనాంసి జానతామ్
దేవా భాగం యథాపూర్వే సంజానానా ఉపాసతే ॥

**పరమేశ్వరుని ఉపదేశం:**

ఓ మానవులారా! మీరంతా కలిసి మెలిసి ప్రీతితో సన్మార్గమున ప్రవర్తింపుడు. మధురమైన వచనాలతోనే మాట్లాడుకొనుడు. మీ మనస్సులన్నీ ఏకమై ఆలోచించాలి. పూర్వులవలె మీరుకూడా జ్ఞాన సంపన్నులు, కర్తవ్య పరాయణులునై జీవించాలి.

**3.** సమానో మన్త్రః సమితిః సమానీ సమానం మనః
సహ చిత్తమేషాం సమానం మంత్రమభి మంత్రయే వః
సమానేన వో హవిషా జుహోమి ॥

ఓ మానవులారా! మీ ఆలోచనలు సమానములై ఉండాలి. మీ మనస్సు, చిత్తము (బుద్ధి) ఒకటై ఉండాలి. మీరందరు కలిసి మానవ సంఘంగా జీవించాలి. ఆ మానవులందరి కొరకు ఉపదేశించినది కనుక ఆ వేదాన్ని చదివే హక్కు అందరికి ఉంది. అందరికి అగ్నిహోత్రంలో ఆహుతులిచ్చే అధికారముంది.

**4.** సమానీ వ ఆకూతి: సమానా హృదయాని వః ।
సమానమస్తు వో మనో యథావః సుసహాసతి ॥

–ఋగ్వేదం. 10. 191. 1 నుండి 4

ఓ మానవులారా! మీ అందరి హృదయాలు, ఆలోచనలు, సంకల్పాలు సమానమై ఉండాలి. మీ అందరి మనస్సులు ప్రేమ పూరితములై సమానంగా ఉండాలి, సదా అందరు కలిసిమెలసి సుఖ జీవనాన్ని గడపండి" అంటుంది

**65. ప్రశ్న: గురూజీ! మీరు చూపిన సమానత్వాన్ని బోధించే మంత్రాలు చాలా బాగున్నాయి. ఇట్టి మంత్రాలు ఇంకా ఉన్నాయా?**

**ఉత్తరం:-** నాలుగు వేదాలలోను అక్కడక్కడ ఇట్టి మంత్రాలు వందకు పైగా ఉన్నాయి. అథర్వవేదంలో కూడా ఇట్టి మంత్రాలు చాలా ఉన్నాయి. ఉదాహరణకు -

**ఓం సహృదయం సాంమనస్య మనిద్వేషం కృణోమి వః ।**
**అన్యో అన్యమభి హర్యత వత్సం జాతమివాఘ్న్యా ॥**

- అథర్వ. 3.30.1

ఓ మానవులారా! మీరంతా నా ఈ వేదోపదేశాలను అనుసరిస్తూ సహృదయులు కండి. ఒకరినొకరు సరిగా అర్థం చేసుకోండి. ఒకరి నొకరు ద్వేషించుకోకండి. అప్పుడప్పుడు మీలో ఏ కారణంచేతనైనా ఒకరిపై ఒకరికి ద్వేషం విరోధం కలిగితే

**"యోఽస్మాన్ ద్వేష్టి, యం వయం ద్విష్మః తం వో జమ్భే దధ్మః"**

-అథర్వవేదం. 3.27.1.6

అనే మంత్రాలను స్మరించుకోండి. నవజాత గోవత్సాన్ని గోమాత ప్రేమించునట్లు పరస్పరం ప్రేమించుకోండి" అని చెబుతుంది.

**66. ప్రశ్న: గురూజీ! మీరు ఉదహరించిన ద్వేష విసర్జన మంత్రభాగం గురించి మరికొంత వివరించండి.**

**ఉత్తరం:** జిజ్ఞాసువులారా! అథర్వవేదం తృతీయకాండలోని 27వ, సూక్తంలో గల 6 మంత్రాలు పరస్పర ద్వేషభావాన్ని విడవండని చెబుతాయి. వీటిని మహర్షి దయానందులవారు సంకలనం చేసిన సంధ్యావందనంలో 'మనసా పరిక్రమ మంత్రాలు' గా కనబడతాయి. అందు మొదటి మంత్రం -

**"ఓం ప్రాచీ దిగ్నిరధిపతి రసితో రక్షితాదిత్యా ఇషవః**
**తేభ్యో నమోఽధిపతిభ్యో నమో, రక్షితృభ్యో నమ, ఇషుభ్యో**
**నమ ఏభ్యో అస్తు, యోఽస్మాన్ ద్వేష్టి, యం వయం ద్విష్మః**
**తం వో జంభే దధ్మః॥.**

-అథర్వవేదం. 3.27.1

తూర్పు దిక్కునకు ప్రకాశ స్వరూపుడైన పరమాత్మ అధిపతిగా ఉండి ప్రాణులు అంధకారంలో పడి ప్రుగ్గిపోకుండా తన ఆదిత్యరూప బాణాలతో రక్షించుచున్నాడు. అట్టి సర్వవ్యాపక సంరక్షకునికి మా వందనాలు. తూర్పుదిక్కునకు అధిపతిగా ఉన్న అతని ప్రకాశ శక్తికి, అతని బాణరూప ఆదిత్యునికి (సూర్యునికి) మా నమస్కారాలు. వాటిని మేము సద్వినియోగం చేసుకొందుముగాక! వీటన్నిటికి మరొకసారి నమస్కారం. ఎవరు మమ్ము ద్వేషిస్తున్నారో, ఎవరిని మేము ద్వేషిస్తున్నామో అట్టి మాలోని ద్వేషాన్ని నీ న్యాయరూప బాహువులకు అర్పిస్తున్నాము. నీవు అందరికి తగినవిధంగా న్యాయం చేయువాడవు. కనుక మేము పరస్పర ద్వేషరహితులమై శాంతిని అనుభవింతుముగాక ఈ పై మంత్రం ఇంత పెద్ద అర్థాన్ని కలిగివుంది. ఇట్టి పై మంత్రాలు నాలుగు దిక్కులకు నాలుగు పైన క్రింద మొత్తం 6 దిక్కులకు 6 మంత్రాలు చెప్పబడ్డాయి. అయితే, పరమేశ్వరుని అద్భుత రక్షణ శక్తులు 6 దిక్కులకు 6 వేరువేరుగా ఉన్నాయి.

**67. ప్రశ్న: గురూజీ! మీరు ఉదహరించిన వేదమంత్రం కేవలం తూర్పు దిక్కున ఉన్న రక్షణ శక్తి గురించే చెబుతున్నది. వేరే మంత్రాలలో ఏ ఏ రక్షణ శక్తులు చెప్పబడ్డాయి?**

**ఉత్తరం:** జిజ్ఞాసువులారా! మీలో పెరుగుతున్న జిజ్ఞాసకు నా అభినందనలు, సంక్షిప్తంగా చెబుతున్నాను శ్రద్ధగా వినండి.

తూర్పు దిక్కున దేవుని ప్రకాశకశక్తి ఆదిత్య బాణంతో అంధకారాన్నుండి కాపాడుతున్నది.

**దక్షిణా దిగింద్రోఽధిపతిః తిరశ్చి రాజీ రక్షితా పితర ఇషవః ..**

దక్షిణదిక్కున ఇంద్రశక్తి (ఐశ్వర్యశక్తి) పితరు లనే బాణాలతో తిర్యక్ ప్రాణులబారినపడి మరణించకుండా కాపాడుతున్నది. ఇచట పితరుంటే తల్లిదండ్రులు కాదు.

రాత్రివేళలలలో చంద్రకిరణాలతోను, నక్షత్ర, అగ్ని, విద్యుత్తులతోను కాపాడుతున్నదని అర్థం. తిర్యక్ ప్రాణులంటే వంకర టింకరగా ప్రాకే పాములు, జట్టెలు మొదలైనవని అర్థం.

**ప్రతీచీ దిగ్వరుణోఽధిపతిః పృదాకూ రక్షితాన్న మిషవః".**

పడమట దిక్కున దేవుని వరుణశక్తి అధిపతిగా ఉండి, అన్న బాణంతో

(ఆహార పదార్థాల నుత్పన్నం చేస్తూ (మెరుపులు పిడుగులతో) ప్రాణుల ఆకలి బాధను నివారిస్తున్నది.

**ఉదీచీ దిక్ సోమో౽ధిపతిః స్వజోరక్షితా శని రిషవః........**

ఉత్తర దిక్కున దేవుని సోమశక్తి అధిపతిగా ఉండి అశని బాణంతో స్వజల (వైరస్‌ల) బారిన పడి వ్యాధిగ్రస్తులం కాకుండా కాపాడుతున్నది.

**ధ్రువా దిగ్విష్ణు రధిపతిః కల్మాషగ్రీవో రక్షితా వీరుధ ఇషవః......**

క్రింది దిక్కునకు దేవుని వైష్ణవీశక్తి అధిపతిగా ఉండి, కల్మాషగ్రీవాల (మురికి గొట్టాలకాలుష్య) బారినపడి బాధలుపడకుండా వీరుధ బాణాలతో (వృక్షజాతులతో) గాలిని శుద్ధి చేస్తూ కాపాడుతున్నది.

**ఊర్ధ్వా దిగ్ బృహస్పతి రధిపతిః శ్విత్రో రక్షితా వర్ష మిషవః......**

పై దిక్కున దేవుని బృహస్పతీ శక్తి మేఘాలను నిర్మించి వర్షబాణంతో (వర్షాలను కురిపించి), భూమి ఎండి ఎడారి కాకుండా కాపాడుతున్నది.
......

ఈ మంత్రాలలో చాలా వైజ్ఞానికత ఉంది. వివరంగా తెలుసుకో గోరువారు నా రచన **"సంధ్యావందనం - వైజ్ఞానిక సమాలోచనం"** లో చూడగోరుచున్నాను.

చివరగా మరొక సమానత్వాన్ని బోధించే మంత్రాన్ని చెప్పుకొని ఈ ప్రకరణాన్ని ముగిద్దాము.

ఓం **సమానీ ప్రపా సహవో౽న్న భాగః, సమానే యోక్త్రే**
**సహ వో యునజ్మి సమ్యఞ్చో౽గ్నిం, సపర్యతారా**
**నాభిమివాభితః ॥.** -అథర్వవేదం (3-30-6)

మీ అన్న పానీయ స్థానాలు - అన్నీ అందరికి ఒకటిగానే ఉండాలి. కులాలను బట్టి వేరువేరు బావులు, చెరువులు ఉండకూడదు. అట్లే అగ్నిహోత్ర, ప్రార్థనా స్థానాలు ఒక చోటనే ఉండాలి.

బండి చక్రంలో ఆకులెన్ని ఉన్నా ఒకే నాభికుండంలో ఇమిడి ఉన్నట్లు మనుష్య లెన్ని రకాలుగా ఉన్నా వారి అన్న పానీయ స్థానాలు, ప్రార్థనా స్థానాలు ఒక్కచోటనే ఉండాలి" అంటుంది వేదం. అట్టి వేదోపదేశాలను అనుసరించటం ఆచరించటమే వైదిక ధర్మం.

## రాజ్యం - రాజ్యాంగం

68. ప్రశ్న: గురూజీ! వేదం సామ్రాజ్యనిర్మాణం గురించి ఏమంటుంది?

**ఉత్తరం:-** మానవుల సమగ్రోన్నతికి, సంరక్షణకు రాజ్యనిర్మాణం చాలా అవసరం. వ్యక్తి శక్తి కన్న సామూహికశక్తి చాలా బలమైనది. ఒక్కొక్క కట్టెను విరచటం తేలిక కాని, కట్టెల కట్టను విరచటం చాలా కష్టం. అసాధ్యమని కూడా అనవచ్చు. కనుకనే వేదం రాజ్య నిర్మాణం, రాజ్యాంగ నిర్మాణం చేసుకోమంటుంది. ఆ రాజ్యాన్ని పాలించటానికి 3 సభలు (Parliaments) ఏర్పరచాలంటుంది. రాజు (రాష్ట్రపతి) ఒక్కడే ఉండాలి కాని సభలు మూడుండాలి. ఈ మూడు సభలు చేసిన నిర్ణయాలనే రాజు అమలు పరచాలంటుంది వేదం -

ఓం **త్రీణి రాజానా విదథే పురూణి పరి విశ్వాని భూషథః**
**సదాంసి, అపశ్యమత్ర మనసా జగన్వా వ్రతే గంధర్వాన్**
**అపి వాయుకేశాన్॥** -ఋగ్వేదం (3-38-6)

## సృష్టికర్త ఉపదేశం

ఓ మానవులారా! రాజును, ప్రజలును కలిసి దేశరక్షణకొరకు, విశేష సుఖాలు ప్రాప్తించుట కొరకు విద్యా విజ్ఞాన సాంకేతికల వృద్ధి కొరకు, రాజ ప్రజా సంబంధరూప వ్యవహారాల కొరకు, ధర్మ ప్రచారం కొరకు (త్రీణి సదాంసి) మూడు సభలను (Parliamentsను) ఏర్పాటు చేసుకోండి. ఆ మూడు సభలు ఏవేవిటంటే-

1. **విద్యార్య సభ:** గురుకుల విద్యా వ్యవస్థలను నడిపేటి సభ
2. **ధర్మార్య సభ:** ప్రజలను ధర్మాత్ములుగా తీర్చిదిద్దే వ్యవస్థ - సన్న్యాసులు, వానప్రస్థులు మహాత్ములతో కూడిన సభ
3. **రాజార్య సభ:** ప్రజలను పాలించేది, రక్షించేది. నేటి రాజ్యాంగంలో ఈ రాజార్యసభ ఒక్కటే ఉంది.

**"తం సభా చ సమితిశ్చ సేనా చ"** (అథర్వ-15-2-2)

పై మూడు సభలు రాజు ఆధీనంలోను, రాజు ఆ సభల ఆధీనంలోను ఉండాలి. ఈ సభలు ప్రజల ఆధీనంలో ఉండాలి. అంటే - ప్రజలంతా ఏ

యోగ్యుని ఎన్నుకొంటే అతనిని రాజుగా చెయ్యాలి. ఆ రాజు యొక్క అధ్యక్షతలో ఈ మూడు రకాల సభలను ఏర్పాటు చేసి వాటితో రాజు రాజ్యాన్ని పరిపాలించాలి.

**69. ప్రశ్న: గురూజీ! ఇది ప్రజాస్వామ్యంలా కనబడుతున్నదే ?**

**ఉత్తరం:** ఔను. ఇది పూర్తిగా ప్రజాస్వామ్యమే. అయితే యోగ్యత ఉన్నవారినే సభాసదులుగా నియమిస్తారు. విద్యార్యసభ సభ్యుడు కావాలంటే పూర్ణ విద్వాంసుడై ఉండాలి.

ధర్మార్యసభలో చతుర్వేద వేత్తలు, త్యాగులు, తపస్యులు ధర్మవేత్తలే ఉండాలి. రాజార్యసభలో రాజ్యపాలనా వ్యవహారాలన్నీ చక్కగా తెలిసినవారే ఉండాలి. అంటే బాగా అధ్యయనం చేసినవారే ఉండాలి. అమాయక ప్రజలు ఎన్నుకొన్నవారు కాదు. రాజు వీరందరినీ తన వశంలో పెట్టుకోగల శక్తి సామర్థ్యాలు కలవాడు, ఇంద్రియ నిగ్రహపరుడు, ప్రజలను పుత్రులవలె చూచువాడు కావాలి.

ఈ విషయాలు విస్తృతంగా సత్యార్థ ప్రకాశం షష్ఠమ (6వ) సముల్లాసంలో(6th Chapter లో) వివరించ బడ్డాయి.

**70. ప్రశ్న: రాజ్యాంగం (Constitution) గురించి వేదం ఏమంటుంది?**

**ఉత్తరం:** రాజ్యనిర్మాణం గురించీ, రాజ్యాంగ నిర్మాణం గురించి మనకు వేదం ద్వారానే తెలిసాయి. లేకుంటే పశువుల మందలవలె ఉండేవారము.

**ఓం భద్ర మిచ్ఛన్త ఋషయః స్వర్విదః**
**తపో దీక్షా ముపనిషేదు రగ్రే**
**తతో రాష్ట్రం బలమోజశ్చ జాతం**
**తదస్మైదేవా ఉపసం నమన్తు** –అథర్వవేదం.19.41.1

సృష్ట్యాదిలో అంతర్ముఖులై పరమేశ్వరుని ఆనందాన్ని చవిచూచిన ఋషులు తోటి సామాన్య ప్రజల భద్రతకొరకు, పాలన పోషణల కొరకు, వారి ఉన్నతికొరకు బాగా ఆలోచించారు. దీక్షతో తపస్సు చేశారు. ఆ తపో దీక్షలవల్ల అంతర్యామియైన పరమాత్మ వారికి రాష్ట్ర నిర్మాణం ఎలా చెయ్యాలో తెలిపాడు. అప్పుడు వారు వేదాలను పరిశీలిస్తూ రాజ్యాంగ నిర్మాణం చేశారు. దానితో రాష్ట్ర నిర్మాణము – బల ఓజస్సులు లభించాయి. అంటే – ప్రజల సంగఠనాబలం, సామర్థ్యం లక్షల కోట్లరెట్లు పెరిగాయి. అట్టి రాష్ట్రానికి, రాజ్యాంగానికి సామాన్య ప్రజలేకాక విద్వాంసులు ఋషులు కూడా

(సంనమస్తు) వినమ్రులయ్యారు. దానికి మేము కూడా కట్టుబడి ఉంటామని ప్రతిజ్ఞ (ప్రమాణం) చేశారు.

ఆ విధంగా నిర్మింపబడిన రాజ్యాంగం అప్పటినుండి మహాభారత యుద్ధ సమయం వరకు తరతరాలుగా అమలు చేయబడింది. ఆ ఋషులు ఏర్పరచిన రాజ్యాంగం తెలుసుకోవాలంటే మన ప్రాచీనతమ మను మహర్షి రచిత మనుస్మృతి గ్రంథాన్ని చదవక తప్పదు. మధ్య కాలంలో ఆ గ్రంథంలో చాలా ప్రక్షిప్తాలు (చొప్పింపులు) జరిగాయి. వేదజ్ఞాన వెలుగులో ఆర్యవిద్వాంసులు స ప్రమాణికంగా ఆ చొప్పింపులను తొలగించి "విశుద్ధ మనుస్మృతి" ని రూపొందించారు. అట్టి వాటిలో ప్రొఫెసర్ సురేంద్రకుమార్ గారి హిందీ రచన చాలా వివరంగా ఉంది. ఇట్టి గొప్ప గ్రంథాన్ని వాచస్పతి డా॥ మట్టికృష్ణారెడ్డిగారు సరళంగా తెలుగు భాషలో అనువదించారు. నేడు ఈ విషయంలో "Ph.D" లు చేస్తున్న విద్యార్థులకు అది మార్గదర్శనం చేస్తున్నది. ఇది అన్ని ఆర్యసమాజ మందిరాలలో లభిస్తుంది

## ఆదర్శదేశం - దేశ భక్తి

71. ప్రశ్న: **గురూజీ! మీరు ఉదహరించిన మంత్రంలో రాష్ట్ర పదం వచ్చింది. మీరుకూడా మాటిమాటికి ఆదర్శరాష్ట్రం, రాష్ట్ర భక్తి అంటున్నారు? ఇంతకీ రాష్ట్రం అంటే దేశమా? లేక రాష్ట్రాలా?**

**ఉత్తరం:** జిజ్ఞాసువులారా! మీలో జిజ్ఞాస పెరుగుతున్నందుకు నా అభినందనలు, శుభాకాంక్షలు. రాష్ట్రం అనే పదము **రాజృ-దీప్తౌ"** అనే మూల ధాతువుతో ఏర్పడుతుంది. కనుక రాష్ట్రం అంటే ప్రకాశించేది. తనలోనున్న వారిని ప్రకాశింపచేసేది అని అర్థం. దానిని మనం ప్రాంతీయ భాషలలో దేశం అంటున్నాము. కనుక రాష్ట్రం అంటే తాను దేదీప్యమానంగా కీర్తి ప్రతిష్ఠలతో ప్రకాశిస్తూ, దేశవాసులందరిని ప్రకాశింపచేసేది - అని అర్థం. కనుకనే మనం దేశాధిపతిని (రాజును) రాష్ట్రపతి (President) అని అంటున్నాము.

"Kings way" ని 'రాష్ట్రపతి రోడ్డు'ను అంటున్నాము.

72. ప్రశ్న: **మరి, వేదం ఆదర్శరాష్ట్రం ఎలా ఉండాలంటుంది? ఎటువంటి రాష్ట్రాన్ని మనం కోరుకోవాలి?**

**ఉత్తరం:** ఈ ప్రశ్నకు వేదం చాలా పెద్ద సమాధానమే చెబుతుంది. అథర్వవేదం 12వ కాండంలోని మొదటి సూక్తమంతా ఆదర్శరాష్ట్రం గురించిన వివరణయే. ఇది 63 మంత్రాలుగల చాలా పెద్ద సూక్తం. ఉదాహరణకు అందులోని మొదటి మంత్రాన్ని గురించి తెలుసుకుందాము -

ఓం **సత్యం బృహద్ ఋతముగ్రం దీక్షా తపో బ్రహ్మయజ్ఞః**
**పృథివీం ధారయన్తి, సా నో భూతస్య భవ్యస్య పత్న్యురుం**
**లోకం పృథివీ నః కృణోతు॥.** అథర్వవేదం. 12. 1. 1

దేశమాత రక్షణ, ఉన్నతి కలగాలంటే దేశ ప్రజలు వ్రతాలలో గొప్పదైన సత్యవ్రతాన్ని స్వీకరించి సత్యనిష్ఠులు కావాలి. **ఋతములు** (సృష్టి నియమాలు) ఉగ్రమైనవి, వాటిని గ్రహించి జ్ఞాన విజ్ఞాన సాంకేతిక రంగాలలో ఉన్నతిని సాధించాలి.

ప్రజలంతే దీక్షావంతులు - పట్టుదలగలవారు కావాలి. శీతోష్ణాలను, కష్ట సుఖాలను భరించే తపశ్శీలురు కావాలి. బ్రహ్మజ్ఞానం - ఆత్మ పరమాత్మల జ్ఞానం కలవారు కావాలి. పంచ మహా యజ్ఞాలను, విశేష యజ్ఞాలను చేసేవారు కావాలి. ఈ ఆరు సుగుణాలతోనే మనం మాతృభూమిని అలంకరించవలసి ఉంది. అర్చించవలసి ఉంది. అట్టి సుగుణ భూషితయైన మాతృ భూమి భూతకాలంలో చక్కగా ప్రజలను పాలించింది. మీరంతా ఈ 6 సద్గుణాలను అలవరించుకుంటే భవిష్యత్తులోను అది మీకు ఉన్నతిని కలిగిస్తుంది. ప్రపంచానికి గురువులను, పాలకులను చేస్తుంది.

ఈ విధంగా ఈ సూక్తంలోని 63 మంత్రాలు మనకు ఎన్నెన్నో విషయాలను బోధిస్తాయి. వీటి అనువాదం మనకు **"మాతృ భూమి-స్వరాజ్యము (పృథివీ సూక్తము)"** పండిత గోపదేవశాస్త్రిగారి రచనలో లభిస్తుంది. దానిలో మొదటి మాటలు కూడా తప్పక చదవండి. అందులో పృథివీసూక్త సారాంశం ఉంటుంది.

**73. ప్రశ్న: గురూజీ ప్రజాస్వామ్యాన్ని గురించి చెప్పే వేదప్రమాణ మేదైనా ఉందా?**

**ఉత్తరం:** అక్కడక్కడ ఇట్టి మంత్రాలు యజుర్వేదంలోను, అథర్వవేదంలోను ఉన్నాయి.

ఉదాహరణకు-

ఓం  ఇమం దేవా అసపత్నం సువధ్వం, మహతే క్షత్రాయ,
మహతే జ్యైష్ఠ్యాయ, మహతే జానరాజ్యాయ, ఇంద్రస్యేంద్రియాయ
ఇమమముష్య పుత్రమ్, అముష్యైపుత్రమ్ అస్యై, విష ఏష
వోఽ_మీ రాజా సోమోఽ_స్మాకం బ్రాహ్మణానాం రాజా॥

-యజుర్వేదం (9-40)

ఓ విద్వాంసులారా! మీలో ఒక శ్రేష్ఠవ్యక్తిని రాజుగా ఎన్నుకోండి. అతనికి మీరంతా సహకరించి బలపర్చండి. అట్టి రాజు మిమ్ము చక్కగా పాలించగలడు. రక్షించగలడు. అప్పుడు రాజ్యం ఏ ఒక్కనిదో కాక అందరిది ఔతుంది. అందుకనే నేను **"మహతే జానరాజ్యాయ"** అంటున్నాను. అతడు యోగ్యుడు, సౌమ్యుడు అగుటవలన విద్వాంసులను కూడా రక్షించగలడు" అంటుంది.

**"వయం రాష్ట్రే జాగృయామ పురోహితాః** (యజు. 9-22)"

**పురః హితాః**- ముందుగానే రాష్ట్రహితాన్ని కోరే విద్వాంసులమైన మేము సదా జాగరూకులమై మంత్రుల మయ్యేదము గాక. చక్కటి సలహాల నిత్తుముగాక!" అంటూ విద్వాంసులంతా సంకల్పించా లంటుంది. రాజును, జనులను ప్రేరేపించమంటుంది. ఇట్టి మంత్రాలు అథర్వవేదీయ పృథివీ సూక్తంలో మరెన్నో ఉన్నాయి. **"వయం తుభ్యం బలిహృతః స్యామ"** అవసరమైతే మాతృదేశ రక్షణకు బలికావటానికి సంసిద్ధులు కమ్మంటుంది.

## రాష్ట్రగీతం - జాతీయ గీతం

## (National Anthem)

**74. ప్రశ్న: గురూజీ! రాష్ట్రగీతం ఎలా ఉండాలంటుంది వేదం**

**ఉత్తరం:** చాలా చక్కటి ప్రశ్న. రాష్ట్రగీతం దేశవాసుల ఆశయాలను, ఆదర్శాలను, ఆశలను తెలిపేదిగా ఉండాలి. అందుకు యజుర్వేదంలో చక్కటి రాష్ట్ర గీతం ఉంది.

ఆ బ్రహ్మన్ బ్రాహ్మణో బ్రహ్మవర్చసీ జాయతామ్
ఆరాష్ట్రే రాజన్యః శూర ఇషవ్యోఽ_తివ్యాధీ మహారథో
జాయతామ్, దోగ్ధ్రీ ధేనుర్వోఢాఽ_నడ్వాః నాశుః సప్తిః
పురంధి ర్యోషా జిష్ణూ రథేష్ఠాః సభేయో యువాస్య

యజమానస్య వీరో జాయతామ్, నికామే నికామే నః
పర్జన్యో వర్షతు, ఫలవత్యో న ఓషధయః పచ్యంతామ్,
యోగక్షేమో నః కల్పతామ్॥ -యజుర్వేదం (22-22)

అర్థం:- ఓ సర్వవ్యాపక సర్వ సంరక్షక సర్వేశ్వరా! నీ కృపవలన మా రాష్ట్రంలో (దేశంలో) వేదవిద్యా సుశోభితులైన బ్రాహ్మణులు దేశమంతటా ఉద్భవింతురు గాక! బాణవిద్యా నిపుణులు, శూర వీరులు, శత్రువులకు అత్యధిక వ్యధను కలిగించు పరాక్రమవంతులు, అతిరథ మహారథులు నైన రాజన్యులు (**క్షత్రియులు**) అంతటా ఉద్భవింతురు గాక! గోవులు దుగ్ధ పూర్ణములగును గాక! ఎద్దులు భారవాహన సామర్థ్యముగలవి యగును గాక! అశ్వములు శీఘ్రగాములగును గాక! **(యోషా పురంధిః)** స్త్రీలు గృహ సామ్రాజ్ఞులై ప్రజలను చక్కగా పోషింతురు గాక! (రథేష్ఠాః) రథాలపై యుద్ధం చేయువారు రథికులు సదా జయశీలురగుదురు గాక! **(అస్య యజమానస్య)** ఈ రాష్ట్ర నాయకునికి (రాజుకు) పూర్ణ యువావస్థను బొందు సభ్యులైన వీరపుత్రులు - అనుచరులు చక్కగా ప్రాప్తింతురు గాక! మేము కోరినపుడల్లా మేఘాలు వర్షించును గాక! మా అన్న, ఔషధాదుల నొసగు పంటలు పుష్కలంగా పండును గాక! మాకు కావలసిన యోగక్షేమములన్నీ ప్రాప్తించునుగాక!

**75. ప్రశ్న: గురూజీ! ఈ వేద మంత్రంలో మన దేశం పేరు లేదుగదా! ఇది మనకెట్లు వర్తిస్తుంది?**

**ఉత్తరం:** మనం పూర్వం చెప్పుకొన్నట్లుగా వేదం సృష్ట్యాదిలోనే పరమాత్మ ఆదిమానవుల కిచ్చిన జ్ఞానం. కనుక ప్రపంచ దేశాల వారంతా నిరభ్యంతరంగా ఈ గీతం పాడుకోవచ్చు, ఇందులో చెప్ప బడిన 11 విషయాలు (సుఖాలు, సౌకర్యాలు) మానవమాత్రులందరికి అవసరమైనవే కదా! ఈ మంత్రంలోని "**ఆ రాష్ట్రే**' అనే పదము వచ్చిన చోట మనం "**మా భారతదేశంలో**" అనే భావం కలిగి ఉందాము. ఇతర దేశాలవారు వారి దేశనామం స్మరించుకోవచ్చు. కనుక ఇది సార్వభౌమికగీతం. ఇంతేగాక, ఈ గీతం సర్వకాలాలకు - భూత వర్తమాన భవిష్యత్కాలలోనూ వర్తిస్తుంది.

**76. ప్రశ్న: మనదేశంలో ఇతర మతాల వారు కూడా ఉన్నారుకదా వారు మన వేదాన్ని అంగీకరించరు కదా! మరి ప్రత్యామ్నాయంగా ఏ గీతం**

ఆలపించాలి? జనగణ మన అధినాయిక జయహే భారత భాగ్య విధాతా" అనే గీతాన్నా? లేక "వందే మాతరం సుజలాం సుఫలాం, అనే గీతాన్నా?

**ఉత్తరం:** నాయనలారా! ఇది చాలా మందికి తెలియని విషయం. ఏమంటే మనం బ్రిటిష్ పాలనలో ఉన్నపుడు ఇంగ్లాండు నుండి విక్టోరియా మహారాణి ఒకసారి మనదేశానికి రావటం జరిగింది. అప్పుడు మహారాణికి ఒక స్వాగత గీతం వ్రాయమని శ్రీరవీంద్రనాథ్ ఠాగుర్ గారిని బ్రిటిష్ వారు అడిగారు. ఆంగ్లమానస పుత్రుడైన రవీంద్రనాథ్ గారు బ్రిటిష్ రాణిని గొప్పగా పొగుడుతూ **"జనగణ మన అధినాయిక జయహే భారత భాగ్యవిధాత..."** అంటూ ఈ స్వాగతగీతాన్ని వ్రాశారు. అట్టి గీతాన్ని మన జాతీయగీతంగా ఎన్నుకోవటం ఆనాటి పెద్దలు చేసిన పెద్ద పొరపాటు. అంతకన్న స్వాతంత్ర్య సంగ్రామంలో అందరికీ, అన్ని వర్గాల వారికీ, అన్ని మతాల వారికి కూడా స్ఫూర్తి నిచ్చిన గీతం వందేమాతరం మాత్రమే. ఈ జాతీయ గీత చరిత్రను కే.శే. రాజీవ్ దీక్షిత్ గారి మాటలలో వింటేనే మీకు సరియైన అవగాహన కలుగుతుంది.

అట్టి వీడియోలు అందుబాటులో ఉన్నాయి. ఒకసారి తప్పక వినండి. లేదా నా రచన **"జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసీ"** లో 94 నుండి 100 పేజీలు ఒకసారి చదవండి.

**77. ప్రశ్న: గురూజీ! 'వందే మాతరం' గీతంలో మాకు 2,3 చరణాలే తెలుసు దాని పూర్తి స్వరూపం తెలపగలరా?**

**ఉత్తరం:** మిత్రులారా! వందేమాతరం గీతాన్ని రాజఋషి శ్రీ బంకిమ్ చంద్ర ఛటోపాధ్యాయిగారు వ్రాశారు. ఆ మహానుభావుడు ఒక గొప్పకవి, అనన్య దేశభక్తుడు ఆయన వ్రాసిన 'ఆనందమఠం' అనే నవల ఆనాటి దేశభక్తులలో పోరాట స్ఫూర్తిని, చైతన్యాన్ని కలిగించింది. ఆ నవల లోనిదే ఈ వందేమాతర గీతం. దాని పూర్తి స్వరూపం – అర్థంతో సహా ఒక వీడియోలో నింపబడింది. దానిని "Smart Phone -Youtube"లో చూడండి. వాటిలో ఒకటి తెలుగు అర్థాలతో చాలా శ్రావ్యంగాఉంది.

1. **వందే మాతరం వందేమాతరం వందేమాతరమ్**
**సుజలాం సుఫలాం మలయజ శీతలామ్**
**సస్య శ్యామలాం మాతరం – వందేమాతరమ్**

2. శుభ్ర జ్యోత్స్నా పులకిత యామినీమ్
ఫుల్ల కుసుమిత ద్రుమదళ శోభినీమ్
సుహాసినీం సుమధుర భాషిణీమ్
సుఖదాం వరదాం మాతరం -
వందేమాతరం, వందే మాతరమ్

3. కోటి కోటి కంఠ కలకల నినాద కరాలే
కోటికోటి భుజైరధృత ఖర కరవాలే
కీనోమాం ఏతోబలే
బహు బల ధారిణీం నమామి తారిణీం
రిపుదళ వారిణీం మాతరం - వందేమాతరమ్

4. తుమి విద్యా తుమి ధర్మ
తుమి హృది తుమి మర్మ'
త్వం హి ప్రాణాః శరీరే
బహుతే తుమి మా శక్తి
హృదయే తుమి మా భక్తి
తుమారయి ప్రతిమా గడి
మందిరే మందిరే - వందేమాతరమ్

5. త్వం హి దుర్గా దశ ప్రహరణ ధారిణీ
కమలా కమలదళ విహారిణీ
వాణీ విద్యాదాయినీ
నమామి త్వాం నమామి కమలాం అమలాం అతులామ్
సుజలాం సుఫలాం మాతరం - వందేమాతరమ్

6. శ్యామలాం సరళాం సుస్మితాం భూషితామ్
ధరణీం భరణీం మాతరం - వందేమాతరమ్

ఈ గీతంలో స్వదేశాన్ని ఒక మాతగా భావించి దానికి వందనం చెయ్యటం జరిగింది. ఇంతేగాక, ఆ తల్లి ఒక మహత్తర శక్తిగా, సకల విద్యా విజ్ఞానాల గనిగా, సకలకళానిధిగా, ప్రేమమయ మాతగా భావించటం జరిగింది. దీనిలో కంచుకాగడా పెట్టి వెతికినా ఏ దోషం ఉండదు.

**78. ప్రశ్న: మన ప్రభుత్వం జనగణ మన గీతాన్నే ప్రతీ కార్యక్రమానికీ ఆలపిస్తున్నది కదా!**

ఉత్తరం: ఆ గీతంతో బాటు వందేమాతరం గీతాన్ని కూడా జాతీయ గీతంగా ఆలపించుకోవచ్చునని రాజ్యాంగంలో రాయబడి ఉంది. ఎవరికి ఏది ఇష్టమో దానిని స్వీకరించవచ్చు. మనం వివేకవంతులం కనుక వందేమాతరం గీతాన్నే ఆలపించుదాం. ప్రేరణ పొందుతూ ప్రగతి మార్గంలో పురోగమిద్దాం. అస్తు.

## చాతుర్వర్ణ వ్యవస్థ అవసరమా?

**79. ప్రశ్న: గురూజీ! సంగఠన గురించి, సమానత్వం గురించి మీరు చాలా విషయాలు చెప్పారు. అట్లే, దేశభక్తి, జాతీయ గీతాల గురించికూడా మాకు తెలియని ఎన్నోవిషయాలు చెప్పారు. ధన్యవాదాలు. కృతజ్ఞతలు. అంతా బాగానే ఉందికాని ఈ నవనాగరిక ప్రపంచంలో వర్ణవ్యవస్థ అవసరమా? వేదం వర్ణవ్యవస్థ గురించి ఏమంటుంది?**

**ఉత్తరం:** నాయనలారా! క్రమక్రమంగా మీ జిజ్ఞాస పెరుగుతున్నందుకు నాకు చాలా సంతోషంగా ఉంది. పెద్ద పెద్ద విషయాల వైపు మీ దృష్టి మరలుతున్నది. ఇది అభినందనీయమే. నేటి ప్రపంచ పరిస్థితిని బట్టి మీరు కులాలనే చాతుర్వర్ణా లనుకుంటున్నారు. ఇది సరికాదు. రెంటికీ కొన్ని తేడాలున్నాయి. వర్ణాలు వారివారి గుణ కర్మలను బట్టి ఏర్పడతాయి. వర్ణ పదము **వృఞ్-వరణే** అనే ధాతువుతో ఏర్పడుతుంది. **వృణుతేర్వర్ణః**- వరించి స్వీకరించే దానిని వర్ణం అంటారు. **"జన్మనా జాయతే శూద్రః కర్మణా ద్విజ ఉచ్యతే"** అంటారు ఋషులు. ఇక్కడ శూద్రుడంటే విద్యలేనివాడని అర్థం. మనకు పుట్టుకతోనే విద్యావిజ్ఞానాలు రాలేదు కదా! అందుచే పుట్టుకతో మనమంతా శూద్రులం. తదుపరి మనకు అభిరుచిగల విద్యలను అభ్యసించి ఆ యా వృత్తులలో స్థిరపడ్డాము. బ్రహ్మణత్వాన్ని అందుకోవాలంటే చాలా ప్రయత్నం చెయ్యాలి. మానవస్మృతి ఏమి చెబుతున్నదంటే -

**శ్లో ॥ స్వాధ్యాయేన వ్రతై ర్హోమై స్త్రైవిద్యా నేజ్యయా సుతైః ।**
**మహాయజ్ఞైశ్చ యజ్ఞైశ్చ బ్రాహ్మీయం క్రియతే తనుః ॥**

-మానవస్మృతి. 2.28

మరొక చోట -

శ్లో॥ శూద్రో బ్రాహ్మణతామేతి, బ్రాహ్మణశ్చైతి శూద్రతామ్।
క్షత్రియాజ్జాత మేవం తు విద్యాద్వైశ్యాత్తథైవ చ ॥

-మానవస్మృతి. 10.65

ఒక వేళ శూద్ర వర్గానికి చెందిన తల్లిదండ్రులకు పుట్టినా అతడు వేద శాస్త్రాలను అధ్యయనం చేసి సదాచారపరుడు, సచ్ఛీలుడు అయితే బ్రాహ్మణత్వాన్ని అందుకోవచ్చు. అట్లే బ్రాహ్మణ వర్ణానికి చెందిన పరివారంలో పుట్టినా చదువు అబ్బక పనిపాటలు చేసుకుంటూ బ్రతకవలసివస్తే అతనిని శూద్రునిగా పరిగణించాలి . మిగతా వర్ణాలవారికిని ఇట్లే వర్తిస్తుంది" అంటుంది. భగవద్గీతలోనూ, మిగతా శాస్త్రాలలో కూడా ఇట్లే చెప్పబడింది.

**ప్రశ్న: గురూజీ! వర్ణాలగురించి వేదం ఏమంటుంది**

**ఉత్తరం:- వేదాలలోని పురుష సూక్తాలలో ఈ ప్రశ్నకు చాలా చక్కటి సమాధానం చెప్పబడింది.**

ఓం **యత్పురుషం వ్యదధుః కతిధా వ్యకల్పయన్ ।**
**ముఖం కిమాస్యాసీత్కి మ్బాహూ కిమూరూ పాదా ఉచ్యేతే ॥**

-యజు. 31.10

80. **ప్రశ్న: ఓ పరమేశ్వరా! నీవు సృజించిన అత్యుత్తమ ప్రాణులైన మానవులలో ఎవరు ఏ స్థానం కలిగియుంటారు? ముఖతుల్యు లెవరు? బాహువులవంటి వారెవరు? నడిపించు కాళ్ళవంటి వారెవరు? ఊరువుల (తొడల) వంటి వారెవరు? పాదాలవంటి వారెవరు?**

గమనిక : ఇక్కడ సమస్త మానవ సమాజాన్ని ఒక పురుష శరీరంగా కల్పన చేసి ఎవరు ఏ స్థానాన్ని కలిగి ఉంటారు? అని ప్రశ్నించటం జరిగింది. ఈ ప్రశ్నలకు సమాధానంగా -

**బ్రాహ్మణోఽస్య ముఖమాసీత్ + బాహూరాజన్యః కృతః ।**
**ఊరూ తదస్య యద్వైశ్యః పద్భ్యాం శూద్రో అజాయత ॥**

-యజుర్వేదం. 31.11

ఓ మానవులారా! పరమేశ్వరుడనైన నేను చెప్పునదేమన - మీలో విద్యా సదాచారములు కలిగినవారు బ్రాహ్మణులుగా ముఖంవలె ఉంటూ

అందరికి చక్కటి మార్గదర్శనం చేస్తూ ఉంటారు. శౌర్యపరాక్రమాలు కలిగిన క్షత్రియులు బాహువుల వలె సమాజాన్ని శత్రువులనుండి రక్షిస్తూ ఉంటారు. వ్యవసాయ వ్యాపార గోపాలనాదులను నిర్వహిస్తూ దేశాన్ని పుష్టివంతము, సుసంపన్నము చేయు వైశ్యులు ఊరువులవలె (తొడలవలె) ఉంటారు. ఇక మానవ సమాజాన్ని తమ సేవా శుశ్రూషలతో నడిపించే శూద్రులు (విద్య అబ్బని కార్మికులు) పాదాలవలె ఈ సమాజాన్ని నడిపిస్తారు. కనుక మనకు అందరూ అవసరమే. శరీరంలో ఏ అవయవం లేకపోయినా యిబ్బందే కదా!

**81. ప్రశ్న: గురూజీ! కొందరు ఈ మంత్రంలోని చివరి మాటలను ఉదహరిస్తూ పద్భ్యాం శూద్రో ఉ అజాయత" అంటే శూద్రులు పాదాల నుండి పుట్టినట్టు కదా! ఈ వాక్యం శూద్రులను కించపరచినట్లు కదా! అని ప్రశ్నిస్తున్నారు. దీనికి మీ సమాధానం ఏమిటి?**

**ఉత్తరం:** ఈ పురుష సూక్తంలో **"జాతః, అజాయత"** అనే పదములు పెక్కుచోట్ల కనబడతాయి. అట్లని, వారు, అవి ఆ యా అవయవాలనుండి పుట్టినవికావు. ప్రాణులన్నీ అమ్మ కడుపునుండే పుడతాయి. ఇది ఒక అలంకారిక వర్ణన. కవి కల్పన. మొదటి ప్రశ్నమంత్రాన్ని పరిశీలించండి. **"ముఖం కిమాసీత్ కిమ్ బాహూ కిమూరూ పాదా ఉచ్యేతే"** అని కదా ప్రశ్న. మానవ సమాజంలో ముఖం వలె ఎవరుంటారు? బాహువులు ఎవరు? ఊరువులు ఎవరు? ఎవరు పాదాలవలె సమాజాన్ని నడిపిస్తారు అని కదా ప్రశ్నలు. వాటికి సమాధానం రెండవ మంత్రం. రెండు మూడు పర్యాయాలు పరీక్షగా చదవండి మీకే అర్థమౌతుంది.

**82. ప్రశ్న: గురూజీ! మన వేద శాస్త్రాలలో నాలుగు వర్ణాలే కనబడతాయి. కాని లోకంలో వీటితో బాటు మరెన్నో కులాలు, ఉపకులాలు, వర్గాలు, సంప్రదాయాలు కనబడతాయి. ఇవన్నీ ఎలా ఏర్పడ్డాయి?**

**ఉత్తరం:** మిత్రులారా! మీ రడిగిన ప్రశ్న సమంజసమే. వాటిని గురించి కొద్దిగా ఆలోచిద్దాము? సృష్టి ప్రారంభంలో ఈ నాలుగు వర్ణాలే ఏర్పడ్డాయి. కాలాంతరంలో జనసంఖ్య పెరిగి, అవసరాలు పెరిగి వృత్తులను బట్టి కులాలు ఏర్పడ్డాయి. క్రమంగా ఉపకులాలు ఏర్పడ్డాయి. ఎట్లంటే ఒక చిన్న గ్రామంలో ముందు ఒక చిన్న కిరాణా దుకాణం ప్రారంభింపబడుతుంది. అందు నిత్యావసరాలతో బాటు కొన్ని మిఠాయిలు, చిరుతిండ్లు పెట్టటం

ప్రారంభమౌతుంది. ప్రజల అవసరాలను గుర్తిస్తూ కొన్ని చిన చిన్న మందులు- జ్వరంగోళీలు, విరేచనాలు తగ్గే గోళీలు, తలనొప్పిగోళీలు కూడా దుకాణదారుడు పెడతాడు. ఆ గ్రామ జనసంఖ్య పెరిగితే మిఠాయి దుకాణాలు వేరుగా, మందుల దుకాణాలు వేరుగా, బట్టల దుకాణాలు వేరుగా ప్రారంభింపబడతాయి. అట్లే, వేరు వేరు వృత్తులవారు ఆ గ్రామంలో స్థిరపడతారు. ఈ వృత్తులే క్రమంగా కులాలుగా స్థిరపడ్డాయి. అయితే, ఇప్పుడు ఏది బ్రాహ్మణ వృత్తి, ఏది వైశ్యవృత్తి, ఏది శూద్రవృత్తి అనేది నిర్ణయించటం చాలా కష్టంగా ఉంది. మేము క్షత్రియులం అనేవారు కూడా వ్యవసాయంలోనో, వ్యాపారంలోనో, ఉద్యోగాలలోనో స్థిరపడుతున్నారు. సైనికులుగా లేదా సైనిక ఆఫీసర్లుగా స్థిరపడ్డవారు తక్కువగా కనబడుతున్నారు. అన్ని కులాలలోను డాక్టర్లు, సైంటిస్టులు, ఇంజనీర్లు ఉన్నారు కనుక మనమంతా పెద్ద మనస్సుతో ప్రాచీన శాస్త్రాలలో తెలుపబడిన బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యుల గుణ కర్మ స్వభావాలలో మనం ఏ వర్గంలోనికి వస్తామో స్వయంగా ఆలోచించి నిర్ణయించుకోవటం మంచిది. బుద్ధి జీవులను బ్రాహ్మణులనీ, భుజబలంతో దేశరక్షణకు అంకితమైనవారిని క్షత్రియులనీ, వ్యాపార వ్యవసాయ గోరక్షణాది కార్యాలలో నిమగ్నమైనవారిని వైశ్యులని, ప్రయత్నించినా చదువబ్బని కార్మికులను శూద్రులని అనుకోవటం మంచిది.

## ధనధాన్యాలను సమృద్ధిగా సంపాదించండి విరివిగా దానధర్మాలు చెయ్యండి

83. ప్రశ్న: గురూజీ! మనిషి బ్రతకటానికి కూడు, గుడ్డ, నీడ కనీసావసరాలని పెద్దలంటారు. ఈ మూడు కావాలంటే ధనం సంపాదించక తప్పదు కదా! ఈ విషయంలో వేదం ఏమంటుంది?

ఉత్తరం: మిత్రులారా! ఈ విషయంలో వేదం మిమ్ములను సమర్థిస్తుంది. ఇంతేగాక, చక్కటి మార్గం చూపెడుతుంది.

వేదాలలో మొదటిది ఋగ్వేదం. అందులోని మొదటి సూక్తంలోనే ఈ విషయం ఉపదేశించబడింది.

ఓం అగ్నినా రయిమశ్నవత్ పోషమేవ దివే దివే యశసం వీరవత్తమమ్.

- ఋగ్వేదం. 1.1.3

"ఓ మానవులారా! నా ఉపదేశమేమంటే – దినదినము (ప్రతి దినము) పరిశ్రమించి ధనాన్ని సంపాదించండి. ఆ ధనం మిమ్ములను చక్కగా పోషించేది కావాలి. ఇంతేగాక, అది మీకు కీర్తిని, శక్తిని పెంచేదిగా ఉండాలి" అంటుంది. అంటే, ధనం కూడబెట్టటానికి కాకూడదు. అది మనసు చక్కగా పోషించేదిగాను అన్నంలేని నిరుపేదలను పోషించి కీర్తిని తెచ్చేదిగాను ఉండాలి" అంటుంది. అథర్వవేదం మరొక అడుగు ముందుకువేసి

ఓం    శతహస్త సమాహర, సహస్రహస్త సంకిర ।
కృతస్య కార్యస్య చేహ స్ఫాతిం సమావహ ॥

–అథర్వవేదం. 3. 24. 5

"ఓ మానవులారా! ఈ ఉత్తమ మానవజన్మను పొందిన మీరు నూరుచేతులున్నట్లుగా ధర్మమార్గాన ధనాన్ని సంపాదించండి. వెయ్యి చేతులున్నట్లుగా దానిని సత్పాత్రులకు దానాలు చేస్తూ సత్కీర్తిని, పుణ్యాన్ని ఆర్జించండి. మీరు చేసిన కార్యాలు మీకు ఉన్నతిని కలిగించటంతోబాటు పరులకు మార్గదర్శనం చెయ్యాలి. వారికికూడా అవి ఉన్నతిని కలిగించాలి, అవన్నీ మీకు సంతృప్తిని కలిగించాలి" అని బోధిస్తుంది. ఇట్టి ధనార్జన గూర్చిన ధర్మమార్గాలు వేదాలలో వందలకొలది ఉన్నాయి.

ఋగ్వేదం 10వ మండలంలోని 117వ సూక్తమంతా ఈ విషయాన్నే బోధిస్తుంది. ఆ సూక్తానికి **"దాన ప్రశంసా"** సూక్తమని పేరు. అవన్నీ ఇక్కడ వ్రాయ వీలుపడటంలేదు, వాటిని గురించి వేదంలోనే చదువుకోండి. ఇక మనం పుస్తకాన్ని ముగించే ప్రయత్నం చేద్దాము.

**84. ప్రశ్న: గురూజీ! పుస్తకం ముగింపు అంత తొందరగానా! మాకు చాలా విషయాలు తెలుసుకోవాలని ఉంది. కనీసం మాకు ధన విషయంలో ముఖ్యంగా వరకట్నాల విషయంలో వేదం ఏమంటుందో తెలుపండి.**

**ఉత్తరం:** నేడు లోకంలో వరకట్నాల బాధింపులు పెచ్చు పెరిగి పోతున్నాయి. అది నేరమని తెలిసినా ఏదో రూపంలో దానిని రాబట్ట యత్నిస్తున్నారు. వేదం దీనిని నిశితంగా నిషేధిస్తుంది.

అథర్వవేదం 14వ కాండలోని మొదటి సూక్తం 64 మంత్రాలు గల పెద్ద సూక్తం. అందులోని 17 నుండి చివరి మంత్రం 64 వరకు గల మంత్రాలకు దేవత – దంపతీ. అంటే ఆ మంత్రాలలో దంపతులు ఎలా

ఉండాలో చెబుతాయి. వాటిలో 27వ మంత్రం ఏమి చెబుతున్నదో చూడండి-

**ఓం అశ్లీలా తనూర్భవతి రుశతీ పాపయాముయా ।**
**పతిర్యద్ వధ్వో వాససః స్వమంగ మభ్యూర్ణుతే ॥**

-అథర్వవేదం. 14.1.27

వధువు యొక్క వస్త్రాలతో తన శరీరాన్ని కప్పుకొను - (అంటే వధువు తనవెంట తెచ్చిన వస్తువులను, సంపదలను అనుభవించు) వ్యక్తి శరీరం దూషితమౌతుంది. అది అతని వినాశనానికి కారణమౌతుంది" అంటున్నది వేదం.

85. ప్రశ్న: **గురూజీ ! సోమరితనాన్ని గురించి వేదం ఏమి చెబుతుంది?**

**ఉత్తరం:** జిజ్ఞాసువులారా ! సోమరితనాన్ని గురించి వేదం నిశితంగా ఖండించినది.

1. **ఓం అక్షైర్మా దీవ్యః కృషిమిత్ కృషస్వ ।**
**విత్తే రమస్వ బహు మన్యమానః ॥**

-ఋగ్వేదం. 10.34.13

"ఓ మానవులారా! మీరు వ్యవసాయదారునివలె కష్టించి ధనాన్ని సంపాదించండి. కాని జూదరివలె కాదు. పేకాటతోను, లాటరీలతోను, పందాలతోను, వరకట్నాలతోను, దురాక్రమణలతోను ధనవంతులం కావాలని ఆశించకండి" అంటుంది

2. **ఓం మోఘమన్నం విన్దతే అప్రచేతాః ।**
**సత్యం బ్రవీమి వధ ఇత్ స తస్య ॥**

-ఋగ్వేదం. 10.117.6

"కష్టపడకుండా అన్నాన్ని, సంపదలను పొందగోరే సోమరి తప్పక కష్టాల పాలగును. ఇది పూర్ణ సత్యం" అంటుంది. శౌచాలన్నిటికన్న (పవిత్రత లన్నిటికన్న) అర్థశౌచమే సర్వ శ్రేష్ఠమంటుంది ఋగ్వేదం,

86. ప్రశ్న: **గురూజీ ! అర్థశౌచం గురించి వేదం ఏమంటుంది?**

**ఉత్తరం:** జిజ్ఞాసువులారా ! వేదం అన్ని విషయాలలోను శౌచాన్ని పాటించాలంటుంది. ఈ క్రింది మంత్రం పరిశీలించండి.

ఓం  శుచీ వో హవ్యా మరుతః శుచీనాం శుచిం హి
నో త్స్వధ్వరం శుచిభ్యః ।
ఋతేస సత్యమృత సాప ఆయన్
శుచి జన్మానః శుచయః పావకాః ॥

–ఋగ్వేదం.7.56.12

సృష్టికర్త సందేశం:

"ఓ ప్రపంచ జనులారా! శుద్ధులైన మీ యొక్క వస్తువులు కూడా శుద్ధంగా, పవిత్రంగా ఉండాలి. మీరు శుద్ధధర్మము ననుసరించి సంపాదించిన శుద్ధపదార్థాలతోనే అగ్ని హోత్రంలో ఆహుతులివ్వండి. శుద్ధమైన ధనంతోనే దానధర్మాలు చెయ్యండి. శుద్ధమైన వైదిక నియమానుసారం జీవితాలు గడుపుతూ మనస్సును, ఆత్మను శుద్ధం చేసుకోండి. జూదమాడటం, అన్యాయం మోసం చెయ్యటం, ఇతరుల ధనాన్ని సంపదలను ఆశించటం మొదలైనవన్నీ అధర్మ సంపాదనలే. ఇట్టివి మిమ్ము మీ గృహాలను, మీ పరివారాన్ని, దేశాన్ని కూడా నాశనం చేస్తాయి". **తస్మాత్ జాగ్రత్త!**

ప్రియ జిజ్ఞాసువులారా వైదిక ధర్మాన్ని గురించి తెలుసుకోవలసిన మరెన్నో విషయాలున్నాయి వాటిని గురించి సూచన ప్రాయంగా ఇక్కడ తెలిపే ప్రయత్నం చేస్తాము. ముఖ్యమైన వాటిని గురించి అడగండి.

87. **ప్రశ్న: గురూజీ ! గోవుల గురించి వేదం ఏమంటుంది?**

**ఉత్తరం: గోవులు :** మన వేదాలు పశుగణాలలో గోవుకు ప్రథమ స్థానాన్నిస్తాయి తల్లిపాల తరువాత మానవుడు జీవితాంతం వాడవలసిన పాలలో ఆవుపాలే శ్రేష్ఠమైనవి. అవి తల్లిపాలతో సమానమైన పోషక విలువలను కలిగి ఉంటాయి. సత్త్వగుణాన్ని మేధాశక్తిని, సౌందర్యాన్ని పెంచే క్రొవ్వును, స్ఫూర్తిని, దీప్తిని కలిగిస్తాయి. అందుచే వేదాలు గోవును తల్లితో సమాన మంటాయి. **'గోమాత'** లని పిలవమంటాయి. గోహత్య నరహత్యతో సమాన మంటాయి. గోపూజ అంటే పసుపు, కుంకుమలతో పూజించటం కాదు. వాటిని చక్కగా పాలిస్తూ పోషిస్తూ మన పిల్లలవలె చూసుకోవాలి.

88. **ప్రశ్న: ఆహార నియమాలలో ఏవేవి ముఖ్యం?**

**ఉత్తరం: ఆహార నియమాలు:** వేదాలు మాంసాహారాన్ని నిషేధిస్తాయి. విధిగా శాకాహారమే తీసుకోమంటాయి. గ్రుడ్లు కూడా నిషిద్ధమే. గ్రుడ్లు, మాంసము అనేక వ్యాధులకు కారణమవుతున్నాయని వివేకవంతులైన వైజ్ఞానికు లంటున్నారు. మాంసాహారం తినటమంటే శవాల మాంసం తిన్నట్లే. జంతువులను చంపితేనే కదా ! మనకు మాంసం వస్తుంది. ఆ చంపటం కూడా భయంకరంగా బలాత్కారంగా చంపుతారు.

అప్పుడు వాటి శరీరంలో భయంకరమైన విషాలు తయారౌతాయి. అందుచే మాంసం తినటమంటే కొంత విషాన్ని తిన్నట్లే. మత్తు పదార్థాలు ఏ రూపంలో ఉన్నా నిషిద్ధమే.

శాకాహారంలో సాత్త్వికాహారం తీసుకోవటం ఉత్తమం. ఎక్కువ పులుపు, కారం, మసాలాలు లేని ఆహారాలను మితంగా, హితంగా, తగిన సమయాలలో తినాలి. భగవద్గీతలో (17వ అధ్యాయంలో) తెలిపినట్లు రాజస తామ సాహారాలను పూర్తిగా విడిచిపెట్టాలి. ప్రకృతి వైద్యులు సూచించుచునట్లు వీలైనంతగా సహజ రూపంలో ఆహారాలు తీసుకోవాలి. ఆయుర్వేదం హితభుక్, మితభుక్ లతో బాటు ఋతభుక్ కూడా కావాలంటుంది. **'ఋత భుక్'** అంటే న్యాయార్జితమైన ధనంతో లభించినవై ఉండాలి. వండేవాడిలో, వడ్డించే వాడిలో ప్రేమానురాగాలుండాలి. హితభుక్ అంటే తన శరీర తత్త్వానికి తగిన ఆహారం తినటం. మన శరీరాలలో వాతము, పిత్తము కఫము అనే మూడు తత్త్వాలుంటాయి. అలాగే ఆహార పదార్థాలలోను ఈ మూడు తత్త్వాలు హెచ్చుతగ్గులుగా ఉంటాయి. కనుక ఆయుర్వేద వైద్యులను సంప్రదించి మన శరీరానికి తగిన ఆహార పట్టికను తయారుచేసుకొని పథ్యంగా తినటాన్ని 'హితభుక్' అంటారు.

89. **ప్రశ్న: గురూజీ ! జ్యోతిష్యాల గురించి మీ అభిప్రాయం?**

**ఉత్తరం: ఫలిత జ్యోతిష్యాలు** ఏ రూపంలో ఉన్నా శుభాశుభాలు, వర్జ్యాలు, యమగండాలు మొదలైన వాటిని వైదిక ధర్మం నమ్మదు. మంచి పని చెయ్యటానికి అన్నీ మంచి దినాలే, చెడ్డపని చెయ్యటానికి ఏ దినమూ మంచిది కాదు అంటుంది. మనిషి పురుషార్థపరుడై ముందుకు సాగాలి కాని ముహూర్తాల కొరకు వేచి నష్టపోకూడదు. **"కర్మణ్యేవాధికారస్తే మా ఫలేషు కదాచన"** అని చెప్పినట్లుగా సదా మనం మన కర్తవ్యాలను చేస్తూపోవాలి. ఫలితం ఏది వచ్చినా దైవ ప్రసాదంగా స్వీకరించాలి. గ్రహాల, చిల్లర దేవుళ్ళ

శాంతుల కొరకు సమయాన్ని, ధనాన్ని ఖర్చుచేసుకోవటం మంచిది కాదు. మనం పూర్వజన్మలలోను, ఈ జన్మలోను చేసిన కర్మలకే ఫలితాలు కలుగుతాయి. అవే మన సుఖదుఃఖాలకు, హాని లాభాలకు, జయాపజయాలకు కారణం. పూజలవల్ల, శాంతులవల్ల కాదు. నేడు బహుళ ప్రచారంలో ఉన్న వాస్తు శాస్త్రాలు, సంఖ్యా శాస్త్రాలు కూడా ఇట్టివే. వేదం కేవలం ఇంట్లోకి ధారాళంగా గాలి, వెలుతురు వచ్చే మార్గాలనే సూచిస్తుంది.

**90. ప్రశ్న: జన్మదినాలు, పెండ్లిరోజులు ఎలా జరుపుకోవాలి?**

**ఉత్తరం:** జన్మదినాలు, పెండ్లిదినాలు, స్మృతి దినాలు వైదిక పద్ధతి ననుసరించి జరుపుకోవటం మంచిది. జన్మదినాలు ఆంగ్ల తేదీల ప్రకారం, ఆంగ్లేయులవలె దీపాలు ఆర్పి, కేకును కోయడం మంచిది కాదు. మనం దీపాలను వెలిగించాలికాని ఆర్పకూడదు. అవి జ్ఞానానికి సూచికలు. కేకులకన్న పాయసం మొ॥ వంటింట్లో శుద్ధంగా తయారు చేసుకున్న పదార్థాలనే పంచాలి, తినాలి. అవి అగ్నిహోత్ర పూర్వకంగా జరుపుకుంటే జల వాయువులు శుద్ధమై మనకు, పరులకు ఆరోగ్యాన్ని ఉత్సాహాన్ని కలిగిస్తాయి. స్మృతి దినాలలో పిండాలు పెట్టటం పూర్తిగా వేదవిరుద్ధం. శరీరాన్ని విడిచిన ఆత్మలు వాటి కర్మానుసారం దేవుని వ్యవస్థలో మరొక తల్లి గర్భంలో ప్రవేశిస్తాయి. ఎక్కువ సుఖాలతో కూడిన జన్మను స్వర్గమనీ, ఎక్కువ దుఃఖాలతో కూడిన జన్మను నరకమని వేదవిద్వాంసు లంటారు.

**91. ప్రశ్న: షోడశ సంస్కారాలు అంటే ఏవేవి?**

**ఉత్తరం: షోడశసంస్కారాలు- సంస్కృతి:** మన వేద శాస్త్రాలలో ప్రముఖంగా 16 సంస్కారాలు కనబడతాయి. సంస్కారమంటే మానవ శరీరంలో ప్రవేశించిన జీవాత్మను 16 పర్యాయాలు విశేషంగా సంస్కరించవలసి ఉంది. వాటిలో మొదటిది గర్భాధాన సంస్కారం (నిషేకం), అనంతరం 2) పుంసవనం 3) సీమంతోన్నయనం 4) జాతకర్మ 5) నామకరణం 6) నిష్క్రమణం 7) అన్నప్రాశనం 8) చూడాకర్మ 9)కర్ణవేధం 10) ఉపనయనం 11) వేదారంభం 12) సమావర్తనం 13)వివాహం 14) వానప్రస్థం 15) సంన్యాసం 16) అన్త్యేష్టి (జీవుడు వదిలి వెళ్ళిన శరీరాన్ని అగ్నిహోత్రంగా దహనం చెయ్యటం). అనంతరం 3వ దినం భస్మాన్ని – శ్మశానంలోనే గొయ్యి తీసి పూడ్చాలి. ఇంతటితో సంస్కారాలు 16 ముగుస్తాయి. అనంతరం జీవుని కొరకు చెయ్యవలసింది ఏమీ ఉండదు. నేడు చేస్తున్న శ్రాద్ధకర్మలన్నీ వేదవిరుద్ధం.

యుక్తి విరుద్ధం. హేతు విరుద్ధం, ఇది చాలా పెద్ద విషయం. మరికొంత వివరంగా తెలుసుకోగోరువారు నా రచన "మన వేద శాస్త్రాల పరిచయం" చదువ గోరుచున్నాను. గ్రంథ విస్తరణ భీతిచే ఈ పుస్తకము నింతటితో ముగిస్తున్నాను. మీరు ఆదివారాలలో, పర్వదినాలలో ఆర్యసమాజాలలో జరిగే వైదిక సత్సంగాలకు వెడుతూవుంటే మీ జ్ఞానం క్రమంగా పెరుగుతుంది. అట్లే వైదిక గ్రంథాలను కొద్ది సేపు స్వాధ్యాయం చేస్తూ ఉంటే కూడా మీ జ్ఞానం పెరుగుతూ ఉంటుంది. అస్తు - మనం అదే చేయుదుము గాక!

ఓం **యస్మాత్ పక్వాత్ అమృతం సంబభూవ**
**యో గాయత్ర్యా అధిపతిర్బభూవ ।**
**యస్మిన్ వేదాః నిహితా విశ్వరూపాః**
**తేనౌదనేనాతి తరాణి మృత్యుమ్ ॥** -అథర్వవేదం (4-35-6)

ఏ పరిపక్వతత్త్వంతో అమృతం **(ఆత్మజ్ఞానం)** పుట్టిందో, దేనిలో గాయత్రీ మంత్రం ద్వారా ప్రతిపాదించబడిన పరమేశ్వరతత్త్వం స్పష్టంగా ఉపదేశింపబడిందో అట్టి వేదాలు సమస్త విద్యానిలయాలు. ఆ మార్గంలో పయనించినవారే ఆత్మపరమాత్మల సాక్షాత్కారాన్ని పొంది జననమరణరూప సంసార సాగరాన్ని తరించి అమృతత్వాన్ని - జన్మరాహిత్యాన్ని అఖండ పరమానందాన్ని పొందుతారు.

అథర్వవేద 4వ కాండ 35వ సూక్తానికి **ఓదన సూక్తమని** పేరు. 7 మంత్రాలుగల ఈ సూక్తమంతా **"స్తేనౌదనేనాతితరాణి మృత్యుమ్"** అనే ధృతవాక్యంతో ముగుస్తుంది. **'ఓదనం'** అంటే అన్నమని సామాన్యార్థం. వృద్ధిచేసేది, ఉన్నతిని కలిగించేది అని మూలార్థం. అల్పజ్ఞులు, అల్పశక్తిమంతులునైన జీవుల ఉన్నతి కొరకే పరమేశ్వరుడు తన గొప్ప తపస్సుతో సృష్టి, స్థితి, ప్రళయాలు చేస్తున్నాడు. సృష్ట్యాదిలోనే వేదజ్ఞానాన్నిచ్చి సృష్టి రహస్యాలను, నియమాలను, ఉన్నతి మార్గాలను తెలిపాడు. కనుక ఈ సూక్తం దేవదేవుని **'ఓదనం'** అనే పేరుతో పేర్కొంటుంది.

**వేదా నిహితా విశ్వరూపా"** అంటూ వేదాలు సర్వవిద్యా నిలయాలంటున్నది.

**92. ప్రశ్న: గురూజీ ! గర్భాధాన సంస్కారం అంటే ఏమిటి?**

**ఉత్తరం:** వివాహానంతరం ఉత్తమ సంతానం కొరకు భార్యాభర్తలు సంగమించేటప్పుడు దానిని ఒక సంస్కారంగా చేస్తారు. ఆ రోజు బృహత్

యజ్ఞంతో బాటు కొన్ని విశేషమాలు, క్రియలు ఉంటాయి. వాటిని అర్థ పూర్వకంగా తెలుసుకుంటే పతీపత్నులలో ఉన్నతీ భావాలు, ఆశయాలు కలుగుతాయి. మా పుత్రపుత్రికలు విద్యావంతులు, వీరులు, త్యాగులు, దానశీలురు మొదలైన భావాలు కలిగిన వారై ఉండాలి. అప్పుడు వారి శరీరాలలోని కణాలలో, క్రోమోజోమ్స్‌లో సానుకూల పరివర్తనం జరుగుతుంది. రజోవీర్యాలలో కూడా ఇది జరుగుతుంది. అందరు ఇది పాటిస్తే దివ్యమానవ నిర్మాణం జరుగుతుంది.

**93. ప్రశ్న: గురూజీ ! పుంసవన సంస్కారం అంటే ఏమిటి? మగపిల్లలు కలగటానికా?**

**ఉత్తరం:** కాదు. కడుపులో పెరిగే బిడ్డలు (మగ, ఆడబిడ్డలు) బలంగా, ఆరోగ్యంగా ఉండటానికి ఇది చేస్తారు.

**"పుమాన్ సూయతే యస్మాత్ ఇతి పుంసవనమ్"** అని నిర్వచనల. ఈ సంస్కారం కూడా యజ్ఞ పూర్వకం విశేష హోమం చేస్తారు. వివరాలు 'సంస్కారవిధి' గ్రంథంలో ఉంటాయి.

**94. ప్రశ్న: గురుజీ ! సోమరితనాన్ని గురించి వేదం ఏమి చెబుతుంది?**

**ఉత్తరం:** జిజ్ఞాసువులారా ! సోమరి తానాన్ని వేదం నిశితంగా ఖండిస్తుంది. **"అకర్మా దస్యుః"** అని కూడా నిందిస్తుంది. అకర్మా అంటే అకర్మణ్యుడు= పని దొంగ, సోమరి అని అర్థం. అట్టివాడు దస్యుడు-దుష్టుడు, రాక్షసుడు, ఇతరుల కష్టార్జితాన్ని దోచుకొనే వాడు అని అర్థం.

**95. ప్రశ్న: గురూజీ ! సోమరితనం పతనానికి దారితీస్తుంది. అంటారు కదా ! పెద్దలు, దీని భావం ఏమిటి?**

**ఉత్తరం:** అవును, సోమరుల వల్ల వారికేకకి తమ కుటుంబానికి కూడా నష్టం కలుగుతుంది. దేశ ప్రజలంతా ఎవరు ఏది చెయ్యగలిగితే అది చేస్తూ ఉండాలి.

**మోఘమన్నం విన్దతే అప్రచేతాః ।**
**సత్యం బ్రవీమి వధ ఇత్ స తస్య ॥**

– ఋగ్వేదం (10-117-6)

"కష్టపడకుండా అన్నాన్ని, సంపదలను పొందగోరే సోమరి తప్పక కష్టాల పాలగును. ఇది పూర్ణ సత్యం" అంటుంది శౌచాలన్నిటికన్న (పవిత్రత లన్నిటికన్న) అర్థశౌచమే సర్వ శ్రేష్ఠమంటుంది ఋగ్వేదం.

**96.** ప్రశ్న: **అర్థశౌచం అంటే ఏమిటి? గురూజీ?**

**ఉత్తరం:** జిజ్ఞాసువులారా ! అర్థశౌచం అంటే డబ్బు విషయంలో పవిత్రంగా ఉండటం. మనం న్యాయంగా, ధర్మంగా, పరహింసా రహితంగా ధనాన్ని ఆర్జించాలి. మనధర్మశాస్త్రం **"శౌచానాం అర్థశౌచం పరమం స్మృతమ్"** అంటుంది. శుచులన్నిటిలో పవిత్రత లన్నిటిలో అర్థం విషయంలో ఎక్కువ పవిత్రంగా ఉండాలి. వేదం ఏమంటుందో చూడండి.

97. ప్రశ్న: **గురూజీ ! సీమంతోన్నయనం అంటే ఏమిటి? లోకంలో ఆచరిస్తున్న సీమంతమేనా?**

**ఉత్తరం:–** ఒకటే, కాని ఆచరించటంలో చాలా తేడాలున్నాయి. అన్ని సంస్కారాలలో వలెనే దానిని కూడ అగ్నిహోత్ర పూర్వకంగా సంస్కార విధిలో చెప్పినట్లు చేసుకోవాలి. సీమంతములు అంటే కపాలంలోని తల పై భాగంలో 8 బల్ల పరపు ఎముకలు ఒకదానితో ఒకటి అతకబడి ఉంటాయి. ఆ కలయిక రెండు వస్త్రాలను కలిపి కుట్టినట్లుగా ఉంటాయి. ఆ కలిపిన అతుకులను సీమంతము లంటారు.

**"పంచ సంధయః శిరసి విభక్తేః సీమంతా"** అని నిర్వచనం. ఆ శిరోపేటికలో అతి సున్నితమైన మెదడు ఉంచబడింది. ఆ మెదడు చక్కగా ఎదగాలని గొప్పగొప్పభావాలు కలగాలని సీమంతోన్నయన సంస్కారం చేస్తారు. **"సీమంతస్య ఉన్నయనం ఉద్భావనం ఇతి సీమంతోన్నయనం"** అని నిర్వచనం.

98. ప్రశ్న: **గురూజీ జాతకర్మ అంటే ఏమిటి?**

**ఉత్తర:** ఇది శిశువు జన్మించిన వెంటనే చేసే సంస్కారం. నేడు ప్రసవాలన్నీ హాస్పటల్‌లోనే జరుగుమన్నాయి. చాలా కొన్ని మాత్రమే ఇంటివద్ద జరుగుతున్నాయి. ఈ సంస్కారం కూడా అగ్నిహోత్ర పూర్వకం విధి, విధానాలతో చేసుకోవచ్చు. హాస్పటల్ నుండి ఇంటికి తీసుకు వచ్చిన తదుపరి కూడా జరుపుకోవచ్చు.

**99.** ప్రశ్న: **గురూజీ ! నామకరణ సంస్కారమంటే పేరుపెట్టడమే కదా!**

**ఉత్తరం:** అవును, కాని, అది కూడా అగ్నిహోత్ర పూర్వకంగా సంస్కారవిధి ననుసరించి చేసుకోవాలి. పేరు అర్థవంతంగాను, మంచి ప్రేరణ కలిగించేదిగాను ఉండాలి.

**100.** ప్రశ్న: నిష్క్రమణ సంస్కారం అంటే ఏమిటి?

**ఉత్తరం:** విద్యార్థులారా ! శిశువును 3 నెలల వరకు గృహంలోనే ఉంచాలి. 3 నెలల తదుపరి ఆరు బయట వాతావరణంలోకి తీసుకురావచ్చు. మొదటిసారి ఆరుబయటకు తీసుకువచ్చే ముందు ఇంటిలో విధిపూర్వకంగా యజ్ఞం చేసుకోవాలి. అనంతరం తండ్రి శిశువు యొక్క కుడి, ఎడమ చెవులలో నిర్దేశిత వేదమంత్రాలనుచ్చరించి శిశువును బయటకు తీసుకు వచ్చి కొద్దిసేపు తిప్పి మరల లోనికి తీసుకువెడతారు. అప్పుడు చదివే మంత్రాలలో సూర్య, చంద్ర కిరణాల విశిష్టత, ఆవస్యకత గురించిన విషయాలుంటాయి.

**101. ప్రశ్న: గురూజీ ! అన్న ప్రాశన సంస్కారం అంటే అన్నం తినిపించటమే కదా! అప్పుడు కూడా హవనం చెయ్యాలా?**

**ఉత్తరం:** అవును అప్పుడు కూడా అగ్నిహోత్రం చెయ్యాలి. ప్రత్యేక జాగ్రత్తలతో అన్నాన్ని మెత్తగా ఉడికించాలి.

అనంతరం ఆ అన్నంతో కొన్ని విశేష ఆహుతులివ్వాలి. శాస్త్రాలే మంటాయంటే-

**దధి మధు ఘృతమన్నం ప్రాశయేత్:-** ఆ అన్నంలో కొద్ది పెరుగు, తేనె, నెయ్యి కలిపి అనంతరం కొద్దిగా ప్రాశనం చేయించాలి అంటాయి. ఆశ్వలాయన గృహ్యా సూత్రాలు ప్రాశనం ఈ క్రింది మంత్రంతో చేయాలంటుంది.

**ఓం అన్నపతే ! అన్నస్య నో ధేహ్యనమీవస్య శుష్మిణః ।**
**ప్రప్రదాతారం తారిష ఊర్జం నో ధేహి ద్విపదే చతుష్పదే ॥**

(యజుర్వేదం. 11-83)

"అన్న ప్రదాతవైన ఓ సర్వేశ్వరా ! మాకు రోగరహితమైన బలదాయక అన్నమును ప్రసాదింపుము. అన్నదాతను వర్థిల్లజేయుము. మా యొక్క ద్విపాద పరివారమునకు, చతుష్పాద గో అశ్వాది పశువులకును బలకరమగు ఆహారము నిచ్చి రక్షించుము". అని సృష్టి కర్తను స్మరించుకుంటూ, ప్రార్థించుకుంటూ తినిపించవలెను.

మనం కూడా నిత్యం మూడు పూటలా ఆహారం తీసుకునే ముందు ప్రార్థించుకోవాలి. అన్నదాత పరమేశ్వరుడని మరువకూడదు. అట్టి దాతకు కృతజ్ఞతలు తెలపటం మన ధర్మం.

**102. ప్రశ్న: గురూజీ చూడాకర్మ అంటే ఏమిటి? ఈ మాట మేము క్రొత్తగా వింటున్నాము.**

**ఉత్తరం:** అవును, చూడాకర్మ అనే మాట లోకంలో వాడుకలో లేదు. పుట్టు వెంట్రుకలు తొలగించటాన్నే మన శాస్త్రాలలో చూడా కర్మ అన్నారు.

ఈ సంస్కారం 3వ సంవత్సరం పూర్తి అయిన తదుపరి అందరికి అనుకూలమైన రోజున స్వగృహంలో ఏర్పాటు చేసుకోవాలి.

యజ్ఞ పూర్వకంగా విధివిధానాలను అనుసరిస్తూ మంత్ర పూర్వకంగా చేసుకోవాలి. విధిలో చాలా నియమాలు, విధానాలు చెప్పబడ్డాయి. మంత్రాలు కూడా ఉంటాయి.

**103. ప్రశ్న: గురూజీ కర్ణవేధం అంటే ఏమిటి? చెవిని వేధించాలా?**

**ఉత్తరం:** కర్ణవేధం అంటే చెవులు కుట్టించటం. ఇది కేవలం ఆడపిల్లలకే కాదు. మగపిల్లలకు కూడా కుట్టించాలి. వారు కూడా దుద్దులు పెటుకుంటే మంచిది. దీనివల్ల జీర్ణకోశం, ప్రేగులు బలపడుతాయట చెవి తమ్మిలో 3 రక్తనాళాలు త్రికోణంగా కలిసి ఉంటూయట. ఆ మూటి మధ్యలో ఉపాయంగా తెలిసిన కంసాలిచే కుట్టించాలట. ఈ సంస్కారం కూడా అగిహోత్ర విధి పూర్వకంగా గృహాలలోనే జరుపుకోవాలి.

**104. ప్రశ్న: గురూజీ ! ఉపనయన సంస్కారం అంటే వడుగు చెయ్యటమే కదా ! మెడలో జంధ్యం వేస్తారు కదా! ఇంకేమైన చేస్తారా?**

**ఉత్తరం:** విద్యార్థులారా ! మీరన్నది కొంతవరకు సరిగానే ఉంది. కాని దీనిలో మరెన్నో విశేషాలున్నాయి. ఇది కూడా పెద్ద సంస్కారమే. దీనిని 8-12 సంవత్సరాల మధ్య చెయ్యాలి. చేసే ముందు 1,2 రోజులు బాలకునిచే ఉపవాసం చేయిస్తారు. ఆక ఎక్కువగా బాధిస్తూ ఉంటే ఫలాహారంగాని, జావవంటి ఆహారాన్ని కాని తీసుకోవాలి. ఆ రోజు శిఖను

(పిలకను) వదిలి మిగిలిన వెంట్రుకలను క్షురకర్మతో తొలగించాలి, స్నానం చేయించి క్రొత్తవి తెల్లనివియైన వస్త్రాలను ధరింపచెయ్యాలి. అంగవస్త్రం ఉత్తరీయం ధరిస్తే అనుకూలంగా ఉంటుంది. తదుపరి విధియంతా విద్యలునేర్పే గురువులు చెయ్యాలి. వివరాలకు 'సంస్కారవిధి' గ్రంథాన్ని చదవండి.

**105. ప్రశ్న: గురూజీ వేదారంభ సంస్కారం అంటే వేదాన్ని చదివించటమా?**

**ఉత్తరం:** అవును, వేదాధ్యయనం ప్రారంభించే ముందు గురుకుల ఆచార్యులు ఈ సంస్కారం చేస్తారు. ఇది కూడా పెద్ద సంస్కారమే. దీనిలోనూ అగ్నిహరత్రం, విధివిధానాలు కొన్ని విశేషక్రియలు ఉంటాయి. ముఖ్యంగా గురువుగారు గాయత్రీ మంత్రోపదేశం చేస్తారు. మేఖలా (మొలత్రాడు) దండధారణ (లాఠీ వంటి కఱ్ఱను) ధరింపచేయిస్తారు. తండ్రి బ్రహ్మచర్యనియాలను ఉపదేశించి, గురువుగారికి అప్పగిస్తారు. అప్పటి నుండి విద్య పూర్తి అయ్యేవరకు పిల్లలు గురుకులాల లోనే ఉండాలి. అప్పుడు వారిని బ్రహ్మచారీ ! అని సంబోధిస్తారు. భిక్షను అలవాటు చేస్తారు. ముందు తల్లిదండ్రుల చేత, బంధువుల చేత భిక్ష వేయిస్తారు. అప్పటి నుండి బ్రహ్మచారులు స్త్రీలను **"భవతీ భిక్షాం దదాతు"** అనియు, పురుషులను **"భవాన్ భిక్షాం దదాతు"** అనియు భిక్షను స్వీకరించి దానిని ముందుగా గురువుగారికి అప్పగించాలి. గురువుగారు అందరు బ్రహ్మచారులు తెచ్చిన భిక్షను పరిశీలించి ఎవరికి ఏమేమి యివ్వాలో, ఎంత ఇవ్వాలో అంత యిస్తారు. అంటే, బ్రహ్మచారులు (విద్యార్థులు) ప్రజలు భిక్షగా పెట్టిన ఆహారాన్ని భుజిస్తూ చదువుకోవాలన్న మాట.

**106. ప్రశ్న: సమావర్తన సంస్కారం అంటే ఏమిటి గురూజీ ? సంక్షిప్తంగా చెప్పండి.**

సంతృప్తిగా అధ్యయనం చేసిన తదుపరి గురుకులాన్ని నిడిచి గృహానికి తిరిగి వెళ్ళే సమయంలో ఈ సంస్కారం చేస్తారు. దీనినే స్నాతకమనీ, స్నాతకోత్సనమనీ లోకంలో వ్యవహరిస్తున్నారు. పూర్వం 24,36 సంవత్సరాల వరకు గురుకులాలలో అధ్యయనం చేసేవారట. వీళ్ళని వరుసగా వసుబ్రహ్మచారులనీ, రుద్ర బ్రహ్మచారులనీ పిలిచేవారట. అరుదుగా కొందరు

48 సంవత్సరాల వరకు వేదాధ్యయనం చేసి 4 వేదాలను, శాస్త్రాలను చదువుకొని వెళ్ళేవారట, వారిని ఆదిత్య బ్రహ్మచారులనే వారట.

స్నాతకులైన విద్యార్థులకు గురువుగారు. మహత్వపూర్వమైన చక్కటి ఉపదేశం చేసి గృహాలకు పంపేవారట.

107. **ప్రశ్న: గురూజీ ఆ ఉపదేశం ఏమిటి? దానిలోని మహత్వం ఏమిటి?**

**ఉత్తరం:** అవును, అది మహత్వపూర్ణమైనదే. అది సర్వకాలాలలోను, సర్వ విద్యార్థులు అనుసరించతగినది. ఇది తైత్తరేయోపనిషత్ మొదటి శిక్షావల్లిలో కనబడుతుంది. అదేమంటే– సంక్షిప్తంగా చెబుతాను.

**"వేదమనూచ్యాచార్యాంతేవాసినమనుశాస్తి । సత్యం వద । ధర్మం చర, స్వాధ్యాయాన్మా ప్రమదః, ఆచార్యాయ ప్రియం ధనమాహృత్య ప్రజాతంతుం మా వ్యవచ్ఛేత్సీః, సత్యాన్న ప్రమదితవ్యమ్, ధర్మాన్న ప్రమదితవ్యమ్, కుశలాన్న ప్రమదితవ్యమ్, భూత్యై న ప్రమదితవ్యమ్, స్వాధ్యాయ ప్రవచనాభ్యాం న ప్రమదితవ్యమ్...**

ఓ ప్రియ శిష్యా ! నీ వెల్లప్పుడు సత్యమును చెప్పుము, ధర్మమునే ఆచరింపుము. ఇంటికి వెళ్ళినప్పటికి వేదాది సత్యశాస్త్రాలను చదువుట మానవద్దు.

విద్య చెప్పిన గురువులకు తగిన దక్షిణనిచ్చి వెళ్ళుము నీ గుణకర్మ స్వభావాలకు అనుగుణంగా ఉండే తగిన కన్యను వివాహమాడి గృహస్థుడవగుము. పంచ మహాయాజ్ఞాది గృహస్థ ధర్మాలను నెరవేర్చుము. తగిన సంతానమును కని వారిని నీవలెనే తీర్చిదిద్దుము. ప్రజాతంతువును కొనసాగింపుము సత్యగ్రహణం సత్యాచరణ విషయంలో ప్రమత్తుడవు కావద్దు. ధర్మాచరణలోను, నీ యోగక్షేమాల విషయంలో కూడా ప్రమత్తుడవు కావద్దు. ఉదాసీనుడవు కావద్దు. జాగ్రత్త వహించు. అట్లే, ఇతర ప్రాణులపట్ల దయతో, ప్రేమతో వ్యవహరించు. ముఖ్యంగా స్వాధ్యాయ ప్రవచనాల విషయంలో ప్రమత్తుడవు కావద్దు. నిత్యం స్వాధ్యాయం చేస్తూ నీ జ్ఞానాన్ని పదునుపెట్టుకో. అట్లే, నీవు గ్రహించిన విషయాలను తోటి ప్రజలకు బోధిస్తూ వుండు. ఈ విధంగా ఆ ఉపదేశం దీర్ఘంగా సాగిపోతుంది. ఇక మనం ముగింపు వైపు పయనిద్దాం.

**108.** ప్రశ్న: గురూజీ ! ప్రాచీన స్నాతకోత్సవం చాలా బాగుంది. ఇంకా తెలుసుకోవాలని కుతూహలంగా ఉంది. మరికొన్ని విషయాలు తెలుపగోరుచున్నాము.

ఉత్తరం: ప్రియ విద్యార్థులారా ! జిజ్ఞాసువులారా ! మీ జిజ్ఞాస ప్రశంసనీయం. మరికొన్ని స్నాతకోపన్యాస విషయాలు తెలుసుకొని ముగించుదాము.

దేవ పితృ కార్యాభ్యాం న ప్రమది తవ్యం,
మాతృ దేవోభవ, పితృదేవోభవ,
ఆచార్య దేవోభవ, అతిథి దేవోభవ,
యాన్య సవద్యాని కర్మాణి వాని సేవితవ్యాని,
యాన్యస్మాకం సుచరితాని తాని
త్వయోపస్యాని నో ఇతరాణి....

తైత్తరీయోపనిషత్ శిక్షావల్లి .7.1.2

ఓ ప్రియ శిష్యులారా! మీరు ఇంటికి వెళ్ళినను దేవతలను-విద్వాంసులను, పితరులను -తల్లిదండ్రులను సేవించుటలో ఏమరుపాటు చేయ వద్దు. బద్ధకించవద్దు. మీకు తల్లి మొదటి దేవత కావాలి. తదుపరి తండ్రి దేవత కావాలి. అనంతరం ఆచార్యుడు దేవత కావాలి. 4వ దేవత అతిథి. ధర్మప్రచారం చేయు సాధు మహాత్ములు, సన్న్యాసులు, వానప్రస్థులు దేవతలు కావాలి. వారిని తగిన విధంగా సేవిస్తూ ఉండండి. మేము మీకు ఉపదేశించిన నిత్య, నైమిత్తిక కర్మలను బద్ధకించకుండా శ్రద్ధతో ఆచరిస్తూ ఉండండి. మా ఆచరణలోని మంచి నడతనే మీరు గ్రహించండి. మిగిలిన వాటిని విడిచిపెట్టండి...అంటూ మరెన్నో ఉపదేశాలు చేస్తారు.

**109.** ప్రశ్న: **గురూజీ ! పురుషులు శిఖను (పిలకను) ధరించాలంటారు కదా! అది ఎందుకు? దానివల్ల ఏమి లాభం?**

**ఉత్తరం:** ప్రియ జిజ్ఞాసువులారా ! అవును. మన సంస్కృతీ సభ్యతలన్నిటి వెనుక కొన్ని వైజ్ఞానిక రహస్యాలు ఇమిడి ఉంటారు. మన మెదడు ఒక పెద్ద కంప్యూటర్ వంటిది. అది ఎన్నెన్నో విషయాలను

గ్రహించగలుగుతుంది. తదను గుణంగా స్పందించ గలుగుతుంది. అట్టి మెదడు సక్రమంగా పనిచేయగలగాలంటే అని కొంత చల్లగా ఉండాలి. అందుచేతనే సృష్టికర్త మన మెదడును సురక్షితంగా ఉంచటానికే ఎనిమిది బల్లపరుపు ఎముకలతో కపాలాన్ని నిర్మించాడు. దాని చర్మంపై వత్తైన వెంట్రుకలను ఏర్పాటు చేశాడు.

మన మెదడు ముందు భాగంలో (నుదుటిభాగంలో) కర్మేంద్రియ కేంద్రాలుంటాయి. వెనుకవైపు శిఖను ధరించే ప్రాంతంలో జ్ఞానేంద్రియ కేంద్రాలను ఏర్పాటు చేశాడు.

మగవారు బలంగాను, చురుకుగాను ఉంటారు కనుక వారి కర్మేంద్రియ కేంద్రాలు చురుకుగా పని చేయటానికి తల ముందు భాగంలో వెంట్రుకలు తొలగించుకుంటే మంచిదని అప్పుడప్పుడు తొలగించుకుంటూ ఉండాలి. వెనుక భాగంలో జ్ఞానేంద్రియ కేంద్రాలుంటాయి కనుక అక్కడ చల్లగా ఉండాలి. వెండ్రుకలు పెంచుకొని ముడివేసుకుంటే మంచిది. లేకుంటే అవి చేదిరిపోతూ మనకు ఇబ్బందిని కలిగిస్తాయి.

మరొక వైజ్ఞానిక రహస్యమేమంటే- మన ప్రాణశక్తి ఊర్ధ్వగతిని చెందుతూ వెంట్రుకలలో నుండి స్వల్పంగా బయటకు వెళ్ళిపోతూ ఉంటుందట. అందుకని శిఖను ముడివేసుకుంటే మన ప్రాణశక్తి మనలో స్థిరంగా ఉండే అవకాశం ఉంటుందని యోగులంటారు.

101. ప్రశ్న: **అవునా గురూజీ ! మన ప్రాణశక్తి కొంత తలవెంట్రుకల ద్వారా బయటకు పోతుందా?**

**ఉత్తరం:** అవును. అందుకు విద్వాంసులేమంటారంటే- అప్పుడే మరణించిన స్త్రీ వెండ్రుకలను ఒక పెద్ద పళ్ళెరంలో నీరుపోసి దానిలో ఆమె వెండ్రుకలను వదులుగా వేసిచూస్తే ఆ వెండ్రుకలు కొద్దిగా కదులుతున్నట్లుగా కనబడుతుందట కాని జీవించి ఉన్నవారితో ఇది కనబడదు. కాని స్వల్పంగా పోతుందట. అందుచే స్త్రీలు ఎప్పుడూ తలవెండ్రుకలను ముడివేసుకోవటం కాని జడవేసుకోవటం కాని చెయ్యాలి. పురుషులు శిఖను ముడి వేసుకోవాలి.

**102.** ప్రశ్న: గురూజీ ! దీనిని గురించిన వేద ప్రమాణం ఏమైనా ఉందా?

**ఉత్తరం:** విద్యార్థులారా ! అన్నిటికి వేద ప్రమాణాలడుగుతున్నారు. అయితే మీకు వేదాలపై భక్తి శ్రద్ధలు కలుగుతున్నాయన్న మాట.

యజుర్వేదంలోని ఈ క్రింది మంత్రాన్ని గమనించండి. ఓం ఆత్మన్నుపస్థే న వృకస లోమముఖేశ్మశ్రూణి న వ్యాఘ్ర లోమ, కేశాన శీర్షణ్యాశస్యే శ్రియై శిఖా సింహస్యలోమ త్విషిరిన్ద్రియాణి ॥ (య. 19.92)

ఎవడు శిఖను ధరించి బ్రహ్మచర్య వ్రతాన్ని పూని వేదాధ్యయనం చేస్తాడో అట్టివానికి బుద్ధివికాసం కలుగుతుంది. సింహ సమాన బలపరాక్రమాలు కలుగుతాయి.

అథర్వవేదం (19.22.15) మంత్రంలో "శిఖిభ్యః స్వాహా" అనే వాక్యం వస్తుంది. శిఖను ధరించువారికి అన్నియు శుభములే కలుగుతాయి. అతడిని మీరు సత్కరించండి" అని భావం.

ఇట్లే మన ప్రాచీన శాస్త్రాలలో పెక్కు ప్రమాణాలున్నాయి. కొందరు ఆధునిక విజ్ఞానవేత్తలును శిఖాధారణపై పరిశోధనలు చేశారు. అందులో సర్ చార్లెస్ పార్లిల్యూకస్, డా.హ్యూమన్, డా.ఐ.ఇ.క్లర్క్, మిస్టర్ ఆర్ల్థామ్సన్ గార్ల అభిప్రాయాలు తప్పక చదువతగినవి. ఈ విషయాలు మీరు బాగా తెలుసుకోగోరితే స్వామి జగదీశ్వరానందగారి హిందీరచన "శిఖాసూత్ర" చదువగోరుచున్నాము. దీని తెలుగు అనువాదం కీ.శే. పం.లోక మల్హారిగారు చేశారు. మీకు దగ్గరలో ఉన్న ఆర్యసమాజ సత్సంగాలకు వెళ్ళి తెలుసుకొండి.

**సర్వే భవంతు సుఖినః, సర్వే సంతు నిరామయాః**

**ఓ3మ్ శాంతిః శాంతిః శాంతిః**

# గాయత్రీ ఆశ్రమ ట్రస్టు ప్రచురణలు

## సుమ్నార్థి డా॥ కోదూరి సుబ్బారావు గారి రచనలు

1. గాయత్రీ మహిమ 30-00
2. గాయత్రీ విజ్ఞానం 100-00
3. మన ఇతిహాసం 70-00
4. మన వేదశాస్త్రాల పరిచయం 60-00
5. అగ్నిహోత్రం 100 శాతం వైజ్ఞానికం 60-00
6. అగ్నిహోత్ర రాసాయనిక విశ్లేషణ 30-00
7. అగ్నిహోత్ర ఆధ్యాత్మిక స్వరూపము 30-00
8. గోమాత 40-00
9. వేదాలలో సూర్యకిరణ చికిత్స 80-00
10. వేదాలలోజలచికిత్సావిజ్ఞానం 50-00
11. పెండ్లినాటి ప్రమాణాలు 40-00
12. గర్భాధాన విజ్ఞానం 50-00
13. దౌహృదిని 40-00
14. మరణానంతరం జీవుని ప్రయాణం 40-00
15. మానవ ధర్మము 40-00
16. ఈశావాస్యమిదం సర్వమ్ 35-00
17. దేవుడు-జీవుడు-ప్రకృతి 30-00
18. వేదాలలో అశ్వనీ దేవతలు 20-00
19. సంధ్యావందనం-వైజ్ఞానిక సమాలోచన 20-00
20. జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసీ 60-00
21. వేదాల వెలుగుచూపే ఆర్యసమాజము 30-00
22. వైదిక జన్మదిన వేడుక 30-00
23. పండుగల పరమార్థం 40-00
24. వైదిక గృహప్రవేశ విధి 30-00
25. వేదాలలో వర్షేష్టి విజ్ఞానం 25-00
26. వైదిక క్రాంతి పథం 30-00
27. పురుషసూక్తము 20-00
28. వైదిక శాంతి పాఠం (వైజ్ఞానిక వ్యాఖ్య) 20-00
29. సృష్టికథ 20-00
30. సరస్వతీ సూక్తము 10-00
31. స్వతంత్ర సముపార్జనలో మహర్షి దయానందుడు 10-00
32. వైదిక సంస్కృతిలో వానప్రస్థాశ్రమము 10-00
33. గంగాధర శివుడు 10-00
34. ప్రణవస్తోత్రము 10-00
35. లక్ష్మీశాంతి సూక్తాలు (ముద్రణలో)
36. వేదాలలో మనోవిజ్ఞానం (ముద్రణలో)
37. వేదోపదేశాలు (ముద్రణలో)
38. వైదిక సుప్రభాతం (ముద్రణలో)
39. శివరాత్రి రహస్యము (ముద్రణలో)
40. గణపతి రహస్యము (ముద్రణలో)
41. వేదాలలో దేశభక్తి 50-00
42. వైదికధర్మం అంటే? 40-00
43. సంధ్యావందనం 40-00

## ఇతర విద్వాంసుల రచనలు

1. మాతాపుత్రికల జ్ఞాన చర్చ 60-00
2. సత్యధర్మ విచారణ 6-00
3. స్వరాజ్య సంగ్రామములో ఆర్యసమాజము (ముద్రణలో)
4. ధర్మవీర్ పం.లేఖారామ్ 5-00
5. వేదాలలో విజ్ఞానబీజాలు (ముద్రణలో)

ముద్రణలో ఉన్నవి దాతలు లభించినపుడు ముద్రింపబడును

# ఆర్య సమాజ నియమాలు

1. సమస్త సత్యవిద్యలకును, విద్యవలన నెరుంగదగు సర్వ పదార్థములకును ఆదిమూలము పరమేశ్వరుడు.

2. ఈశ్వరుడు సచ్చిదానంద స్వరూపుడు, నిరాకారుడు, సర్వశక్తిమంతుడు, న్యాయకారి, దయాళువు, అజన్ముడు, అనాది, అనంతుడు, నిర్వికారుడు, అనుపముడు, సర్వాధారుడు, సర్వవ్యాపకుడు, సర్వాంతర్యామి, అజరుడు, అమరుడు, అభయుడు, నిత్యుడు, పవిత్రుడు, సృష్టికర్తయునై యున్నాడు. అతనినే ఉపాసించుట యోగ్యము.

3. వేదము సత్యవిద్యల గ్రంథము. దీనిని చదువుట - చదివించుట, వినుట - వినిపించుట, ఆర్యులకందరికి పరమ ధర్మము.

4. సత్యమును గ్రహించుటకును, అసత్యమును త్యజించుటకును ఎల్లప్పుడును సిద్ధముగా నుండవలెను.

5. సకల కార్యములను ధర్మానుసారముగా అనగా సత్యాసత్యములను విచారించి చేయవలెను.

6. ప్రపంచమునకు ఉపకారము చేయుట, ఈ సమాజము యొక్క ముఖ్యోద్దేశ్యము.

7. అందరితో ప్రేమ పూర్వకముగ ధర్మానుసారముగ యథాయోగ్యముగ వ్యవహరింపవలెను.

8. అవిద్యను నశింపచేసి విద్యను పెంపొందింప జేయవలెను.

9. ప్రతివ్యక్తియు తన ఉన్నతితోనే సంతృప్తినొందక, అందరి ఉన్నతిలోనే తన ఉన్నతి కలదని తలంపవలెను.

10. సర్వహితకరములగు సామాజిక నియమములను పాలించుటలో పరతంత్రులై వ్యక్తి హితకరములగు నియమములందు స్వతంత్రులగుట అందరికి తగును.



వేదోద్ధారకులు, ఆర్యసమాజ సంస్థాపకులు

# మహర్షి స్వామి దయానంద సరస్వతి

(1824-1883)

GAYATRI SERIES : 69

VAIDIKA DHARMAM ANTE ?

Rs. 50/-



ఓం యస్మాత్ పక్వాత్ అమృతం సంబభూవ
యో గాయత్ర్యా అధిపతిర్బభూవ ।
యస్మిన్ వేదాః నిహితా విశ్వరూపాః
తేనౌదనేనాతి తరాణి మృత్యుమ్ ॥

(అథర్వవేదం 4.35.6)

ఏ పరిపక్వతత్త్వంతో అమృతం **(ఆత్మజ్ఞానం)** పుట్టిందో, దేనితో గాయత్రీ మంత్రం ద్వారా ప్రతిపాదించబడిన పరమేశ్వరతత్త్వం స్పష్టంగా ఉపదేశింప బడిందో అట్టి వేదాలు సమస్త విద్యానిలయాలు. ఆ మార్గంలో పయనించిన వారే ఆత్మపరమాత్మల సాక్షాత్కారాన్ని పొంది, జననమరణరూప సంసార సాగరాన్ని తరించి, అమృతత్వాన్ని - జన్మరాహిత్యాన్ని అఖండ పరమానందాన్ని పొందుతారు.

అథర్వవేద 4వ కాండ 35వ సూక్తానికి **ఓదన సూక్తమని** పేరు. 7 మంత్రాలు గల ఈ సూక్తమంతా **"స్తేనౌదనేనాతి తరాణి మృత్యుమ్"** అనే ధృతవాక్యంతో ముగుస్తుంది. **'ఓదనం'** అంటే అన్నమని సామాన్యార్థం. వృద్ధి చేసేది ఉన్నతి కొరకే పరమేశ్వరుడు తన గొప్ప తపస్సుతో సృష్టి, స్థితి, ప్రలయాలు చేస్తున్నాడు. సృష్ట్యాదిలోనే వేదజ్ఞానాన్నిచ్చి సృష్టి రహస్యాలను, నియమాలను, ఉన్నతి మార్గాలను తెలిపాడు. కనుక ఈ సూక్తం దేవదేవుని **'ఓదనం'** అనే పేరుతో పేర్కొంటుంది. **'వేదా నిహితా విశ్వరూపా'** అంటూ వేదాలు సర్వ విద్యా నిలయాలంటున్నది.

Published by :

**GAYATRI ASHRAM TRUST**

12-10-586/6, Arya Samajam, Medi Bavi,
Seetaphalamandi (Po), Secunderabad - 500061
Secretary : **K.P. Narsing Rao, Mobile : 98480 11073**